కూడుచీరకు నింటఁ గొదవ లేకయుండునె
యడిగినయర్థ మీ ననువుపడునె
యొదిరివా ఖండించు టిది దెప్పరముసుమ్మి
చల్లజంపులు జోగిజంగ కోలము
తే. లడిగితిమి గాని యెవ్వండ నైన నేమి
యొక్కభిక్షుకుగా నిన్ను గోరయ నేల
శైవవీరవ్రతాచారసాహ[1] సంబు
సడిలమగునేని యిప్పుడు నాపనికిఁ జాలు. 52

వ. ఈవృథాలాపంబులఁ బనియేమి నామనోరథంబు వినుము. 53

సీ. ఏఁడుకాలం బయ్యె నేను నిరాహార
ఘోరవ్రతంబుఁ గైకొన్నవాఁడ
హరుని నుద్దేశించి యమ్మహావ్రతమున
కుద్యాపనంబు పరోపహార
మయ్యాగపశువు నన్యం బేదియును గాదు
నరుఁడు కావలయు నన్నరుఁడు బ్రాహ్మ
ణక్షత్రవైశ్యసంతతులలో నొక్కఁ డై
వాఁడును గడుఁ బిన్నవయసువాఁడు
తే. రోగశంకావిహీనుండు రూపసియును
వానితల్లియుఁ దండ్రియు వడుగు సేసి
పాక మొనరించి వడ్డింప భవున కొసఁగి
కుడుతు నాపట్టి నీవు నీకొడుకుఁ గుడువ. 54

వ. అనినం జిఱుతొండనంబి మహాప్రసాదం బయిన వైశ్యకుల
సంభవుండఁ దిరు కచ్చినంబి సంబంధబాంధవుండ నావేరు

1. సుండు, తనయుఁ డొక్కఁడు కల్గ నాపనికిఁ జాలు.

చిఱుతొండనంబి యండ్రు. శివభక్తులకుం బావచర్య సేయు
చుండు. 55

ఆ. భక్తుఁ డేవ్రతంబు పట్టె నావ్రతము పా
రంబుఁ బొందఁ జేయువ్రతము నాది
యీవ్రతంబు నాకు నెప్పుడు నొడఁగూడ
దప్పుడు తిరుబాస యనఘచరిత. 56

వ. నీయానతిచ్చిన ప్రకారంబున నయ్యుపహారంబు సేయించెద
విభూతి యందు కొనుము. మాయింటికి విచ్చేయు మభ్యం
జనస్నానం బవధరించిన యంతలోన వంటకంబు లాయితంబు
లగు నని ప్రార్థించిన. 57

శా. మో మడ్డంబుఁ గదల్చి మోఱకుఁడనుంబోలెన్ శివారాధ
కుం, డామానాధికుతోడ ని ట్లనియె నయ్యా! వృద్ధ నే
నీవచః, ప్రామాణ్యంబులు విశ్వసింప నతిదూరం బానతేవచ్చె
నీ, రామారత్నము కాదు కూడ దనినన్ రాఁ జాల
నీచోటికిన్. 58

చ. ఉదరమునన్ భరించి ప్రసవోద్భవవేదనఁ బొంది పిమ్మటన్
ముదిముది యైనపేతఁ బడి మూత్రమునం బడి లజ్జ వందుగా
నదవద యైనతల్లికిఁ బ్రియంబొ సుతుండు వృథాభిమానదు
ర్మదుఁ డగుతండ్రికిం బ్రియుఁడొ మానసవీథిఁ దలంచి
చూడుమా. 59

వ. [1]ఇంతకుఁ గతం బింతలేసి వీరమాహేశ్వరఘోరవ్రతంబులు
నీవు చేసినయవి లేవు; పుత్రస్నేహంబు సామాన్యంబు కాదు;

---

1. ఇటకృతం.

నీవును నీభార్యయును విచారించుకొనునది; యిక్కార్యంబు
మీా కిద్దఱకును సమ్మతం బగు నేని. 60

తే. అంపునది భూతిఁ బోలుత నీయనుఁగుభార్య
యందుకొనువాఁడ వీవు ననంతరమున
నాలు మగఁడును నొక కుత్తుకైనఁ గాక
యిట్టిధర్మంబు మిన్నక యేల కలుగు. 61

వ. మీా రిద్దఱు సమ్మతించితిర యేనియు హంతవ్యుం డగు నక్కు-
మారుం డిక్కార్యంబునకు నెవ్విధంబున నొడంబడువాఁడు.

తే. నీకుఁ జంపఁగవచ్చుఁ బో నియమనిష్ఠఁ
దక్షిఁ గోర్వంగవచ్చుఁ బో ధైర్యగరిమ
మాకు భజియింపవచ్చుఁ బో మనసుతివుటఁ
జెలుతవానికిఁ [1]జావంగ నలవిగాని. 63

ఉ. పాడయినట్టిచిత్త మొకపాటున [2]నిల్వఁగ మాటిమాటి [3]క
ట్టాడును నుండుఁగానఁ దనయాత్మయునుం దన కిట్టిదౌ ననం
గూడునొకూడదో యెదిరికోర్కె యెఱుంగుటయెట్లు కుట్టియా
చూడఁగ దోసకాయలె విశుద్ధయశోధన యన్యచిత్తముల్.

క. [4]శివభక్తుఁడ యిదెగైకొను
మువిదకును విభూతి యీాప్రయోజనమునకై
యవ్వుఁ గా కన నిచటికి రా
యపంతియే కంచి నీకు నడుగామడయే. 65

---

1. జావు దుస్తరముగాని. 2. నిల్వక. 3. కూ, టాడుచు.

4క. శివభక్తుఁడ యిదికొని య, య్యువిదకును విభూతి యీాప్రయోజనమునకై
యవ్వుఁగాక టొంకి కేఁగు మ, నవలంతియె కంచి నీకు నడు గామడయే.

వ. అనినం జిఱుతొండండు నిజాంతర్గతంబునం దన భార్యకుం గల శివభక్తివిశ్వాసంబులును జంగమారాధన నియమనిష్ఠయుం దన యానతి దాఁటమియునుం గుమారసిరియాళుండు నట్టి వాఁడగుటయు నెఱింగియు నాశివయోగితో నవ్వుఁ గా దని యుత్తరప్రత్యుత్తరంబులకు నెట్టుకొనం జాలక ఛందోను వర్తనంబ మహాప్రసాదం బని యతం డిచ్చు విభూతి యందు కొని నిజమందిరమునకు వచ్చినంత. 66

తే. ఇంటిలోనుండి వెలుపలి కేఁగుదెంచి
యంగనారత్న మగుతిరువెంగనాంచి
భర్తముఖరాగమీక్షించి భ్రమన మొందె
గాలమున నెందు శివయోగి గలిగె ననుచు. 67

వ. చిఱుతొండనంబియు నాబింబాధరకు శివయోగి సంభ్రమించు టయుం దివ్యగీతచర్యా ప్రకారంబును నాదిమధ్యావసానం బుఁ దెలియం జెప్పుటయు నయ్యింతి యింతయు మిసిమింతు రాలు గాక ముసిముసినవ్వు నవ్వి మన శరీరార్థప్రాణంబు లకుం గర్తలు శివయోగీశ్వరులే కాక మఱి యెవ్వరు? వారి సొమ్ములు వారికే సమర్పించు టదియును నొక దొడ్డ పనియే యెటు విశేషించి. 68

చ. వలచినయేని నబ్బువనవంద్యునకున్ [1]శివయోగినేతకున్
బొలకయి గారవం బయిన[2]పుత్త్రుఁ డొకండన నేల నేను న
వ్వలమఱినీవుఁ బ్రాపులగువారమె కామెవిభూతిఁ దెం డిఁకం
బలుకులు వేయు నేటి కలభక్తుని నేమమ పార మొందుతన్.

---

1. శివయోగిరాజునకున్. 2....పుత్త్రకుఁ డొక్కఁడ యేల మాంసమున్ వలముగ మీరు నేము నగువారమె కామె...

వ. అనినఁ బదార్థంబు నిశ్చయించి చందనికయు నవ్వృత్తాంతం
బంతయు నెఱింగించి ముప్పురు నేకోద్యోగంబున శివయో
గికిం బరిచర్య సేయువారైరి. చిఱుతొండండును శివయోగిం
దోడ్తెరం జనియె నటకుఁ బూర్వంబునందు. 70

చ. కపటపుమాయజోగి యగుఖండశశాంకధరుండు వృద్ధవే
షపుఁ బనదూపువీడి వెలిచక్కిన యుండఁగ నొండురూపుతో
నపగతదోషుఁడై సిరియాళకుమారకుఁ డొజ్జయింటిలో
లిపి పఠియింపఁగా మది జలింపఁగఁ జేయుకుతూహలంబునన్.

వ. [1]వచ్చి చూచినంత. 72

ఉ. హస్తగృహీతపుస్తకమునందు లిఖించిన యిట్టి నీలకం
ఠస్తవముం బఠించుచు ఘనంబుగ ధీగుణవైభవోన్నతుల్
విస్తరిలంగ బాలకులు వేవురితో సిరియాళుఁ డుండెన
భ్యస్తలిపిప్రపంచుఁడు గ్రహంబులలో నుడురాజుకైవడిన్.

తే. ఆజటాధారి చేరంగ నరుగుదెంచి
తనకు సాష్టాంగ మెరఁగి తాత్పర్య మెసఁగఁ
గేలుదమ్ములు మొగిచి కెలన నున్న
చిన్నిముద్దులసిరియాళసెట్టి కనియె. 74

శా. అన్నా! యీచిఱుతొండనంబి యనుమాహాత్ముండు మీతం
డ్రియే; యన్నిర్భాగ్యుఁడు జోగి కొక్కరునికిన్ హాలామ
దోన్మాదికిన్, నిన్నుం జంపి మహేశపాకముగ వండింపంగ
నున్నాఁడు సుం, పన్నస్నేహముతోడ నీకు నెఱింగింపన్
వచ్చితిం జెచ్చెరన్. 75

1. వ. జటాధారియై జంగమరూపంబున లలాటలోచనుండు వచ్చె
నప్పుడు. అని కొన్ని ప్రతులలో గలదు.

క. కడుపునఁ బుట్టినకూఁకిమి
కొడుకుఁ సుకుమారమూర్తిఁ గులవర్ధనునిఁ
మెడఁ గోసి చంపి నంజుడు
గుడుపులఁ జోగులకుఁ బెట్టుక్రూరులు గలరే. 76

తే. దానవుఁడు గాక వాఁ డేటితండ్రి చెపుమ
చెక్కనిండినవస వల్క చిఱుతవాని
బత్తుఁ డొక్కఁడు మధుపానమత్తుఁ డగుచు
నిన్ను వేఁడినఁ జంపఁగ నిశ్చయించె. 77

వ. "జీవన్ భద్రాణి పశ్యతి" యను వేదవచనం బవలంబించి యెక్కడికేనిం బోయి యీబారి తప్పించుకొనుట నీకుం గర్తవ్యంబు. 78

చ. అనవుఁడునుం గుమారసిరియాళుఁడు వీనులు మూసికొంచు నో
యనఘచరిత్ర నీకు నిటులానతియీఁ దగు నయ్య నీకుఁ గాఁ
దని పలుకంగ నాకు భయ మయ్యెడుఁ గాక పరార్థమై తనూ
ధనము వ్యయింపఁ గల్గుట కదా జననైకఫలం బెఱింగినన్.

తే. ఎఱుక చాలనివాఁ డంద మే దధీచి
నల్పబుద్ధులె మేఘవాహనుఁడు శిబియు
ధరఁ "బరోపకారార్థ మిదం శరీర"
మనెడువాక్యంబు వినవె సంయమివరేణ్య. 80

తే. అధ్రువం బైనమలభాండ మైనదేహ
మనఘ యన్యోపకారార్థమై వ్యయించి
ప్రవిమలంబుఁ గల్పాంతరధ్రువము నైన
కీర్తికాయంబుఁ గైకొంట కార్తి యేల. 81

వ. అనిన జటాధారిజంగమప్రమథుండు వీఁడు చిఱుతొండనంబి కంటె నధికుండు పొమ్మనుచు మరలి పోవువాఁడు వెండియు.

తే. కపటమాయామహానాటకప్రపంచ
సూత్రధారుండు చిఱుతొండసుతున కపుడు
మూర్ఛరప్పించె హాసుఁ డంచుమోసపోయి
యతురాచార్యుఁడును భయమంద నలసి. 83

శా. నోర న్నుచ్చిలు గ్రమ్మ మై వడకఁ గన్నుల్ తారకాబింబసం
చారవ్యాప్తి నధఃకరింప హృదయస్థానంబు కంపింప గ్రీ
వారంధ్రంబున ఘుర్ఘురధ్వనులు తీవ్రస్ఫూర్తి వర్తింపఁగా
సిరాలుండు ధరిత్రిమీఁదఁ బడి మూర్ఛిల్లె [1]న్సిరాలస్వతన్.

క. మోహాంధకారధారా
వ్యూహమున సిరాలుసెట్టి యును ఉడుగుటయున్
హాహాకారధ్వనికో
లాహల మచ్చోట గుసకులంబునఁ జెలఁగన్. 85

తే. ప్రణుతపంచాక్షరీమంత్ర పారశక్తి
ఘాటమున దేశికుఁడు భూతిఁ బ్రాముటయును
గ్రమ్మఱను మూర్ఛ వెలిసె సిరాల సెట్టి
భక్తులకు భస్మమే కదా ప్రాణరక్ష. 86

వ. అంత నక్కడ. 87

సీ. చిఱుతొండఁ డావృద్ధశివయోగిపుంగవుఁ
బ్రబలకుష్ఠవ్యాధిబాధితాంగు
వీఁపుమీఁద ధరించి వెనువెంట గ్రుడ్డవ్వ
కోలూఁదికొని రాఁగఁ గూర్చుకొనుచు

1. నిమేషంబునన్.

బూది బొక్కణ లాతమును కమండలువును
బులికళాసముఁ గరంబున వహించి
శరణీయు లెదురుగా శరణార్థి సేయుచు
నొయ్యొయ్య సందడి కోసరిలుచు
తే. చంద్రశేఖర భూతేశ శర్వ రుద్ర
పార్వతీనాథ శంకర భవ గిరీశ
కాలకంధర హర కాలకాల యనుచు
వచ్చె నింటికి జనకోటి [1]యిచ్చగింప. 88

మ. మహి నూహింపఁగ నెంతభాగ్యమొకొ యామ్నాయాంత
సిద్ధాంతవాఙ్మహిళాకుంతలమౌక్తికాభరణమున్ మందా
కినీశేఖరుం, గుహానాభైరవు యోగిపుంగవుని భర్గున్ రాజ
మార్గంబునన్, వహియించెం దనవీఁపునం దిరముగా వైశ్యుం
డనాలస్యతన్. 89

ఉ. ఇంటికిఁదెచ్చి యోగిపరమేశునకున్ వణిజుండు తాను వా
ల్గంటియు భక్తియున్ భయము గౌరవమున్ వినయంబు
నాత్మలో,నంటుకొనంగ నప్డు ముసలమ్మకు సైతము కమ్మనూనె
మైం, నంటి నలుంగుతో జలక మార్చి [2]యొసంగిరి ధౌత
వస్త్రముల్. 90

వ. అనంతరంబ యేకాంతగృహంబున సర్వోపచారసంభారభరితం
బుగా దేవతార్చనకుం బెట్టిన నయ్యాదిమదంపతు లిరువురు
శివపూజావ్యాపారంబునం బ్రవర్తిల్లుచుండి రప్పుడు శివా
జ్ఞావశంబునం జేసి. 91

1. పిచ్చగింప. 2. రి యిచ్చిరి.

ఉ. పల్లియచోటనుండి మొలఁ [1]బ్రాఁత గుడుక్కలు జక్కిలంబు
లుఁ, బెల్లపుటచ్చులుం జెనగబేడలుఁ జిమ్మిలి నువ్వుటుం
డలుఁ, బెల్లుగ నంబిపియ్యములు పెద్దజెకంబు బ్రియంబు
నొప్ప మేనల్లునకుం గుమారశిరియాలునకుం గొని తెచ్చి
రక్మలిన్. 92

వ. అంత. 93

సీ. ఫాలపట్టికయందు భస్మత్రిపుండ్రంబుఁ
గర్ణంబులను రాగికమ్మదోయి
కరమునం బిత్తడికంబంపుఁగంబెయు
ఘనకుచంబులమీఁదఁ గావిగంత
కటిమండలంబునఁ గరకంచుఁబుట్టంబు
మడఁచి కట్టిన మేలినడిమికట్టు
కేలుఁదామరయందుఁ గేదారవలయంబు
గడకుచ్చుమీఁదఁ బచ్చడపుఁగండ ?

తే. సంతరించి పదాఱువర్షములవయసుఁ
బచ్చిబాలెంతరాలు తాపసపురంధ్రి
నంబిభామినిఁ బెసవెంగనాంచిఁ జేరి
పాలువోయింపుఁ డన్న పాపనికి ననియె. 94

ఉ. మక్కువ రేఁగి నెయ్యపుఁగుమారుని జంపుట కంతరాయ
మై, యక్కటికంబు పుట్టుటకు నల్లన వచ్చి భవాని యత్తఱిం
జక్కటిమాయజోగితపవేషంబున బిడ్డకుఁ బాలు వేఁడ నా
యక్కయుఁ బోసె నెల్లసమయంబులఁబోలె నిరాకులాత్మ యై.

1. పానెము పడుక్కలు.

తే. పాలువోయించుకొని యాకృపాళుమూర్తి
శూలినాంచారిపాలిండ్లచూచుకములు
పాలచేఁపున గిలిగింతవాఁడుటయును
మెత్తమెత్తన నఱచేత నొత్తుకొనుచు. 96

వ. తిరువెంగనాంచితో ని ట్లనియె. 97

మ. ప్రజలెల్లం బురిఁ గ్రంతక్రంతల మహాపాపంబుగాఁ బల్కె
డున్, నిజమో కల్లయొ కాని మీ రఁట కడున్ నిస్త్రింశ
భావంబునన్, నిజపుత్త్రున్ సుకుమారుఁ జంపి యొక దుర్ని
ర్వాణికిం జోగికి, న్భుజియింపంగ నొనర్చువార టిది యెం
దుం గల్గునే యిద్ధరన్. 98

క. జోగులు కపటోపాయ
ప్రాగల్భ్యంబున నిధాననవసిద్ధులకై
యోగతుల నైనఁ దిరుగుదు
రోగిరముగ సుతునిఁ జంపు టుచితమె మీకున్. 99

తే. ఆవగింజంత భూతి మై నలఁదికొనిన
వెలఁది గుమ్మడికాయంత వెఱ్ఱి పుట్టుఁ
గటకటా యెట్లు తనబుద్ధి కాటఁ గలియ
నిసువుఁ జంపంగఁ దలఁచెనో నీమగండు. 100

క. కానండు గాక కన్నులు
దా నేమిటివాఁడు నీదుతనయునిఁ జంపన్
మానవతీ "మగవాఁడో
మ్రానో" యనుమాట నేఁటిమాటయె చెపుమా. 101

వ. అనినం దిరువెంగనాంచి యక్కపటపుంజంగమదేవిమాటలు
వినక నిర్వికారం బైన యాకారంబుతో నమ్మా శివుఁ డన

శివయోగి యన భేదంబు గలదే? శరణార్థుల యర్థప్రాణం
బులు శివాధీనంబులు, శివుండు కర్త, శివుండు భోక్త, యీ
యర్థంబునకుం జింతింప నేల? నీకుం బడవయ్యెడు. బాలెంతరా
లవు చన్నులు చేఁపుచున్నవి బిడ్డ యింత కెంత యలమటం
జెందునో పాలు చాలుగదా! యెప్పుడు మాయింటికి వచ్చు
చుం బోవుచుండునది నిండుకొని యుండు మని కేలుదోయి
ఫాలంబునం గీలుకొల్పి సముచితవ్యాపారంబులం బ్రవర్తించు
చుండం జంకు గానరాక పార్వతీదేవియు నటనుండి చని
యంతర్ధానంబు సేసె నాసమయంబున. 102

తే. చేర నేతెంచి చిఱుతొండ సెట్టి యంత
యింతి తిరువెంగనాంచితో నిట్టు లనియె
[1]నొజ్జలగృహంబునకుఁ బోయి యుత్పలాక్షి
వడుగు సేయఁగవలెఁ జిన్నవానిఁ దెమ్ము. 103

చ. చెలువ కుమారుని న్వడుగు సేసినచేతడి యాఱకుండఁగాఁ
జోలుపెసలారఁగా నిరుగుపొరుగులవారల భాగ్యసంపదల్
కుల మభివృద్ధిఁ జెంద మనకూరిమినందనుఁ బెండ్లి సేయఁగా
వలయు ననంతరక్షణమ వైభవ మొప్పఁగ ముక్తికన్యతోన్.

వ. అనిన నామెయు నట్లు కాక యని యాచార్యగృహంబున
విద్యాభ్యాసముఁ జేయుచున్న కుమారునిం దోడ్కొని
వచ్చినంత. 105

ఉ. మంచిగ మేనయత్తలు సమాదరణం బడరంగఁ బెట్టి పు
త్తెంచిన మంచిభక్ష్యములు తేనియ నేతను [2]ముంచిముంచి భ

1. నొజ్జలవారింటికేఁగి. 2. దోఁచితోఁచి.

క్షేంచుచుఁ దల్లిదండ్రిఁ దనచిన్నికరాంగుళి వంచివంచి యా
[1]రించుచు నిచ్చ మీఱఁగఁ జరించెఁ గుమారకుఁ డింటిముంగి
టన్. 106

వ. అనంతరంబ. 107

సీ. జడలయల్లిక యూడ్చి సంపంగినూనియఁ
బిన్నకూఁకట్లఁ జొబ్బిలఁగ నంటి
గోష్యదేశంబు సంకుమదద్రవంబున
నయమార నుద్వర్తనంబు సలిపి
గీసి గొజ్జఁగ నీరుపోసి నూఱినక్రొత్త
[2]చిరుబంతి పసుపులోఁ జెవఫు నలఁది
కస్తూరిఁ బొరపినగంధసారంబుతో
నీకాయమెరువున జిడ్డు పఱపి
తే. తేట నులివెచ్చనీరునఁ దీర్థమాడి
వేణి యూటార్చి సురపొన్న విరులు ముడిచి
మఱఁగుకట్టి కాటుక యిడి తొడివి పూసి
భసితరేఖాత్రిపుండ్రంబు నొసటఁ దీర్చి. 108

వ. కయిసేసి కుమారునిం గనుఁగొని జననీజనకు లిట్లనిరి. 109

ఉ. భైరవయోగి కొక్కనికిఁ బాశుపతవ్రతచర్యతీరునం
బారణకై నినుం బలలపాకము గా నొనరించి పెట్టుచు
న్నారము భోజనంబు ప్రియనందన! నీహృదయంబునందు సం
సారముఁ బాయఁజాలనివిచారము లేదుగదా యొకింతయున్.

వ. అనినం గుమారసిరియాళుండు. 111

---

1. ఱించుచు నాడెమిన్నగమి ఱేని కుమారకుఁ డింటిముంగిటన్.

తి. పా. 2. చిఱుబంతి బసపుతోఁ జెవపునలదిఁ... జేవనలఁది.

శా. సంసారభ్రమ మించుకేనియును మత్స్వాంతంబునన్ లేదుమీ
వంశం బీపరిపాటిదే యుడుగుఁడీ వైక్లబ్యసంభావనల్
మాంసాహారము నయ్యెడన్ శివునకున్ మాయామహాయో
గికిన్, హింసాక్లేశము మానుఁడీ గురులు మీరే మిమ్ముఁ
బ్రార్థించెదన్. 112

వ. అని పల్కె నప్పుడు. 113

ఆ. చావ నియ్యకొనిన సత్పుత్రకునకును
జంప నియ్యకొనినదంపతులకుఁ
దారతమ్య మెద్ది వీరమాహేశ్వరా
చారసమయమార్గ గౌరవమున. 114

వ. ఇవ్విధంబున ముప్వురును జందనికాపురస్సరంబుగా నేక
నిశ్చయు లయిరి. తదనంతరమున. 115

సీ. చన్నిచ్చు[1]బాగున జనయిత్రి తొడలపైఁ
బసిబిడ్డఁ బవ్వళింపంగఁ బెట్టెఁ
జందనిక తనహస్తప్రణాళంబులఁ
గ్రిందనంటుక సంతరించుకొనియెఁ
జిన్నిబుగ్గల లేఁత చిఱుతనవ్వు వెలర్ప
సిరియాళుఁడు మొగిడ్చెఁ జేయిదోయి
చిఱుతొండనంబి క్రొమ్మెఱుఁ గార [2]చురకత్తి
కరవాఁడిగా నూరి గంటిఁదీఁడె

తే. నేక మై యట్లు ముప్వురిహృదయములును
గుంద కానందవారిధియందుఁ దేలె
గురులు ముప్వురును గుమారవధునితోడ
నేకవాక్యంబుగాఁ బ్రీతి నిట్టు లనిరి. 116

1. బాగున. 2. గూరుకత్తి వాఁడిగా నూరుచు వంక దీర్చె.

మ. మది శంకింపకు మన్న! మావలనిప్రేమస్నేహవాత్సల్యసం
పద పాటింపకు మన్న! నాలుకతుదిన్ బంచాక్షరీమంత్రముం
బదిలం బొప్పఁ బఠింపు మన్న; పరమబ్రహ్మార్థసంసిద్ధి యి
య్యది సుమ్మన్న! యనుంగునందన! సిరాలా! వీరశైవవ్రతా.

ఉ. నంబి శివార్థమన్ననసునమ్మిక [1]శంక యొకింతయేని చి
త్తంబునయందు లేక వనితామణి యూపలు దాపుఁ జేసి తీ
క్ష్ణం బగుకత్తి మోప మెడ గ్రక్కునఁ ద్రెవ్వి నమశ్శివాయమం
త్రంబుఁ బఠించుచుండెను సిరాలుశిరంబు వసుంధరాస్థలిన్.

ఉ. కందక గాజువాఱక వికారము దప్పక మందహాసని
ష్యందము చెక్కుటద్దముల [2]జాఱక నెమ్మది నిద్రవోవున
ట్లందము నొందె ధాత్రి సిరియాలకుమారునివక్త్రచంద్రుఁడా
నందము నొందె నప్పు డెలనాఁగమనంబును భర్తచిత్తమున్.

తే. పన్నిదం బాడి గెలిచినభావ మొప్ప
నప్పు చక్కంగఁ దీర్చినయనువు మెఱయ
సతియుఁ బతియును గారంపుసుతు వధించి
వరుస నడపిరి వీరశైవవ్రతంబు. 120

మ. మిరియము నుల్లియున్ బసుపు మెంతియు నింగువ జీరకంబు శ
ర్కరయును జింతపండును గరాంబువు గమ్మనినేయి తైలమున్
బెరుఁగును మేళవించి కడుఁ బెక్కువిధంబులఁ బాకశుద్ధి వం
డిరి సిరియాలునిం గటికిడెందమునం దరళాక్షు లిద్దఱున్.121

సీ. కమ్మగాఁ గాఁచినకట్టునంజుళ్లను
నీరు వెళ్లఁగ నొత్తి నేత వేఁచి

---

1. చింత. 2. నాఱక.

చక్కఁగాఁ దఱిగిన సన్నమాంసంబులు
పరిపాటిమై జుట్టుఁబదను వండి
మూల్గుశెమ్ములతోడ ముదక గా కుండఁగ
జాఁదుచేసినవల్లచారు గాఁచి
వలయుసంబారాలు వడియాలు బలియించి
దళమైనక్రొవ్వుతోఁ దాలఁబోసి
తే. షడ్రసోపేతములు గాఁగఁ జతురభంగి
నమృతపాకంబులుగఁ జేసి రాజిఁబంబ
సెట్టి సిరియాలు వంశాబ్ధి శీతకరుని
సతులు తిరువెంగనాంచియుఁ జందనికయు. 122

క. నానావిధపాకములుగ
నానాలుగఁ జేసి యపుడు నాల్గువిధములన్
బోనామువొంతిఁ జేర్చిరి
సూనాస్త్రసమానుఁ డైన సుతు సిరియాలున్. 123

సీ. నిగనిగం గాఁ దోమి నిండుబోనమువొంతి
భోజనశాలలోఁ బొసఁగఁ జేర్చి
చెలువ గొజ్జఁగనీటిచేపట్టు గావించి
పాటించి రత్నకంబళము పఱచి
దేవతార్చకు ధూపదీపాదు లొడఁగూర్చి
కప్పురంబున ముగ్గు గలయఁబెట్టి
యెడమదిక్కున రాగిపడిగెంబు ఘటియించి
గరగతో విమలోదకములు డించి
తే. యతివ సర్వాయితం బయ్యె నయ్యగారి
కారగింపఁగ నవసరం బనుచుఁ బలుక

[1]సెట్టి తోడ్తెచ్చె జంగమసిద్ధవృద్ధ
నంఘురా లగుముదుసలియవ్వతోడ. 124

క. శ్రీపాదంబులు గడిగెను
శ్రీపాదోదకముఁ గొనియెఁ జెలువయుఁ దానుఁ
వ్యాపారిసార్వభౌముం
డాపరమతపస్వి నునిచి యర్చించెఁ దగన్. 125

వ. అనంతరంబ చిగుర ముదురునుం గాని నిడుపు వెడల్పుం గలకదళీపలాశంబు నడిమి యీనియఁ బుచ్చి పఱచి యుద కంబునం బ్రక్షాళించి యుపస్తరించి పాయసాపూప సూప పుండ్రేక్షుద్రాక్షాగోక్షీరమధుశర్కరాఘృతదధిరసావళీ శాక పాక శిఖరిపానకంబులతోడ గారాపుంగొడుకుపాల మేలో గిరంబుతోడంగూడ భరితభోజనంబుగా వడ్డించి గ్రుడ్డి యవ్వకు నైత మట్లనే సమర్పించి, దేవ ! భక్తవత్సల ! శివ యోగీశ్వరరూప ! విరూపాక్ష ! యమృతాహారం బార గించి రక్షింపు మని చిఱుతొండఁడు భార్యయుం దానును భక్తితాత్పర్య విశ్వాసపురస్సరంబుగా నమస్కరించిన. 126

ఉ. భైరవయోగిరాజు పసిపాపనినంజుడుఁగూరలందు లో
నారసి చూచి మస్తకమునందలిమాంసము లేమి గాంచి మీ
నీరసమాంస మేటికి వణిగ్వర ! పుత్త్రునియుత్తమాంగముం
గూరలు సేయ వైతి వివిగో నిజపుత్త్రనిసర్గమోహముల్.

తే. కటకటా ! మావ్రతంబు భగ్నంబుఁ జెందె
నేటిపారణ మిది మాకు నేటి కింక

1. సెట్టి తోడ్తెచ్చెఁ దగ నయ్యశీతివృద్ధుఁ, దోడగుడ్డైన గ్రుడ్డవ్వ తోడఁగూడ. (అశీతివృద్ధుఁడు=ఎనుఁబదేండ్ల ముసలివాఁడు.)

సుత్తమాంగపుమాంసము నుజ్జగించి
యేల యధమాంగమాంస మే నెటు భుజింతు. 128

వ. అనిన విని చిఱుతొండండు భయంపడి వెలవెలంబాఱుచుం దిరువెంగనాంచివదనం బాలోకించి యింక నెట్లనినం [1]జిట్టిమిఱుచు నంతం దలకాయపొ(పా)ల మేలోగిరంబు ముందటం బెట్టి చందనిక యిది యేను మొదలన బెడందకాండ్రగు యోగిబృందారకులచందం బెఱింగినదాన నగుటం జేసి పాకంబుం జేసికొనియున్నదానం దపస్వి చిత్తం బేపాకంబును బొందకుండ వడ్డించెదం గా కని యట్లు చేసిన నక్కహానాభైరవుండు వెండియు. 129

తే. బంతి నీ వారగింపక పరమపుణ్య!
నాకుం జేయాడునే భోజనంబు సేయ
[2]నొకండు భుజియించు నెన్నండు నొప్ప దనెడు
వేదవాక్యార్థ మన్నది వినవె చెపుము. 130

వ. మఱియు నొక్కభోజననియమంబు కలదు పిన్నవాండు బంతి భోజనంబుసేయక కూడు నోటికిం బోదు; మగబిడ్డండు లేని నిర్భాగ్యునింట భోజనంబుసేయం గూడదు. నీకుమాఱు నా బంతికి రప్పింపు మారగించెద మనవుడు. 131

మ. మొదలం దేవర యానతిచ్చితిర యేముం [3]జిత్తవృత్తిక్ష
మఱా, మది నాకుం గొడు కింకనుం [4]గలండు వాం డాడంగ

1. చట్టువంబునం దలకాయయెఱచి. (చట్టువము = తెడ్డు, ఎఱచి = మాంసము.) 2. అధము భుజియించుచుంబో 'కేవలాది' యనుచు, వేదవాక్యంబు బుధు లనవినమె చెపుమ. 3. జిత్తమంచెంతువు, య్యది 4. గలండె.

[1]నెందేగెనో?, చదువం బోయెనొ? పిల్వఁ [2]బంచెద నవశ్యం
బుం బ్రతీక్షించు నీ, యదనం గూరలు చల్లనారవె మహాత్మా!
యోగిచూడామణీ ! 132

వ. అనిన నత్తపోధనుఁ డిట్లనియె. నీయుత్తమాంగన యెలుం
గెత్తి నలుదిక్కులం బిలుచునది. కుమారుండు వచ్చెనేని
బంతిం బెట్టుకొని భుజింతము. రాకుండెనేని నేమును నీ
ముసలియవ్వయుం గుడుత మటుగాక యొఱగొడ్డెంబులు
వలికి నీపడ్డపాటు గొడ్డేఱుఁగా జిడ్డుపఱుం గలవారమె!
యనినం బ్రసాదం బని పతియనుమతిం బురంధ్రీరత్నంబు. 133

సీ. రారా వణిగ్వంశవారాశిహిమధామ !
రారా వికస్వరాంభోరుహాక్ష !
రారా మహాఘోరవీరశైవాచార !
రారా ఘనౌదార్యరాజరాజ !
రారా కుమారకంఠీరవేంద్రకిశోర !
రారా సమగ్రధీరోహిణేయ !
రారా మనోభవాకారరూపవిలాస !
రారా యసారసంసారదూర !

తే. రార నావన్నెవడుగ! రారా తనూజ !
రార సిరియాల! రార నాప్రాణపదమ !
రార నాకుట్టి! నాజియ్య! రార యనుచుఁ
జీరుఁ గారాపుఁగొడుకు రాజీవనయన. 134

శా. అత్తన్వంగి సమస్తదిక్కులను పర్యాయక్రమం బొప్పఁగా
నొత్తెం జిన్నికుమార రార యని యత్యుచ్చైశ్శ్రుతిం జీరినం

---

1. వెంచేసెనే; నేతెంచెనో. 2. బంతునెటునేజాడం బ్రతీక్షింతు.

జిత్తంబుం గనవచ్చె బాలుఁడు మహాశీఘ్రప్రచారంబునన్
దత్తవ్యంజనపాకగంధ్యవయవస్థానప్రతానంబుతోన్. 135

శా. రక్షాపాండుర మైనదేహము నహిగ్రైవేయముం గంధరా
కుక్షిం గప్పును బ్రస్ఫురద్ఘనజటాకోటిన్ శశాంకార్ధముం
జక్షుఃపద్మముతోడ ఫాలతలమున్ సంధిల్ల శంభుండు ప్ర
త్యక్షం బయ్యె సిరాలుతండ్రికిహృదాహ్లాదంబు సంధిల్లఁగన్.

వ. అప్పుడు భయభక్తితాత్పర్యంబులు మనంబున ముప్పిరిగొన
నప్పరమమాహేశ్వరుం డి ట్లని స్తుతియించె. 137

మ. జయ హాలాహలనీలకంధర! మహేశా! భక్తచింతామణీ!
జయ గంగాధర! చంద్రశేఖర! జగత్స్వామీ! కృపాంభో
నిధీ!, జయనీహారధరాధరేంద్రతనయాచారుస్తనద్వంద్వసం
శ్రయ సంలగ్నపటీరకుంకుమరజస్సంపన్న బాహాంతరా! 138

వ. అని మఱియు ననేకప్రకారంబులం బ్రస్తుతించెనిట్లు ప్రత్యక్షం
బైనవిరూపాక్షుండు చిఱుతొండనంబీ! నీవు తుంబురుండవు
సిరియాలుండు కుమారస్వామి తిరువెంగనాంచి యచ్చర.
మీకిద్ద ఱొక్కకకారణంబున మర్త్యయోనిం జనించితిరి.
మీమీస్థానంబులనుండి తొంటిచందంబున నన్నుం గొలు
వుండు. శరీరంబులతోడం గైలాసంబునకు రం డని యను
గ్రహించిన. 139

సీ. వైశ్యాన్వయంబున వసుధ వర్ణనకెక్కి
వేయిగోత్రంబుల వినుతిఁ గాంచి
వీరమాహేశ్వరాచారంబు వదలక
యేడువాడలవార మేము గలసి

వర్తిల్లుదుము వాసి వట్ట మేమియు లేక
యిట్టిబంధులఁ బాసి యే నొకండ
రా బుద్ధి రాదు తారకరాజశేఖర!
యిందఱఁ గొనిపోయి తేని వత్తుఁ

తే. గూర్చుకొని పోవు నీ కొడఁగూడె నేని
నట్లు గా కున్న విచ్చేయు మభవ మరలి
ప్రమథసన్నిధి కేమియు బాధ లేదు
కొలిచెదము నిన్ను మే మెల్లఁ గూడిమాడి. 140

వ. అనిన శంభుండు కరుణించి యేడువాడలుఁ గదలివచ్చునది. నీకుం బ్రియం బగు నివ్వరం బిచ్చితి నని యానతిచ్చిన తత్క్షణంబ. 141

తే. కంచిలో నేడువాడలఁ గలిగినట్టి
[1]నాణెపుంగోమటులతోడ నంబి సెట్టి
[2]యఖిలజీవరాసులఁ గూడి యభ్రవీథి
భాసురస్ఫూర్తి నేఁగెఁ గైలాసమునకు. 142

వ. ఇది కావేరీవల్లభులును నుభయరావలులును గిష్కింధాచల క్రీడావినోదులు నయోధ్యాపురాధీశ్వరులును నగు వైశ్య కులంబులవారలకుం గూటస్థుం డయిన చిఱుతొండనంబి యుపాఖ్యానము విన్నను జదివినను వ్రాసినను బుత్ర పౌత్రాభివృద్ధియును ధనకనకవస్తువాహన సమృద్ధియు నిష్టార్థసిద్ధియు నగును. 143

1. వానె కోమటి పిళ్లయర్వలతు కూడి (వానెవైశ్యుల పిల్ల యువ్వలను గూడి); 2. జంతువులను నభ్ర వీథి.

ఆశ్వాసాంతము

శా. చాముండాపరమేశ్వరీవరకృపాసంవర్ధితైశ్వర్య ! ని
స్సీమప్రాభవ ! లక్ష్మణాగ్రజ ! సుధాసిక్తాక్షరాలాప ! య
భ్యామధ్యార్జునవీరశైవసమయవ్యాపారపారీణతా
సామాన్యప్రతిభావనిర్వహణదీక్షా ! శక్వరాధీశ్వరా ! 144

క. కర్పకటుకాంఘ్రిసేవక
కర్పూరవసంతరాయ ! కావేరీశా
దర్పితరిపుగర్వతమో
హార్పతిసౌందర్యరతి ! యంబుజహాక్షా. 145

తోటకవృత్తము.

అలకాధిపతీ ! సుగుణాభిరతీ !
మలయోద్భవచంద్రసమానయశా !
కులపావన ! యూరుజగోత్రవరా !
లలనాజనతాఝషలక్ష్మనిభా. 146

గద్యము. ఇది శ్రీమత్కమలనాభపౌత్ర మారయామాత్య
పుత్ర వినయవిధేయ శ్రీనాథనామధేయప్రణీతం బైన హర
విలాసంబునందుఁ ద్వితీయాశ్వాసము.

శ్రీరస్తు

# హరవిలాసము



## తృతీయాశ్వాసము.



పర్వతసోపాన
స్థాపక! వేమక్షితీశసామ్రాజ్యశ్రీ
వ్యాపారిముఖ్య! యన్వయ
దీపక! యలకాధిరాజ! దేవయతిప్పా! 1

వ. ద్వితీయవిలాసంబైన గౌరీకల్యాణం బాకర్ణింపుము. 2

ఉ. తారకుఁ డన్ మహాసురుఁడు తామరసాసనదత్తమైన దు
ర్వారవరానుభావమున వ్రాలి త్రిలోకము నేలుచుండు ని
ష్కారణతీవ్రబాధ ననిశంబును ముప్పదిమూఁడుకోట్లబృం
దారకులన్ మహాత్ములఁ బ్రతాపగుణంబున నెచ్చి పాఁతుచున్.

తే. నిరపరాధబాధితు లగు నిర్జరులకు
బంధమోక్షంబుఁ గావించు గంధవహుఁడు
సతులపయ్యెద వెడలించి చన్నుఁగవకుఁ
దప్పు నేసియు దైత్యుచిత్తంబు వడసి. 4

మ. ప్రకటస్నేహవశాధురంధరత పర్వంగా నిశీథంబులన్
సకలాంగంబులు నిక్కి దీపకలికాస్తంభంబులై యుండ్రు పా
యక చూడామణు లొప్ప రాక్షసుని శుద్ధాంతంబులన్ శేష
వాసుకి కర్కోటక తక్షక ప్రముఖచక్షుశ్శ్రోత్రబృందారకుల్.

తే. దానవునివీఁటిలోన మార్తాండుఁ డెండ
యంతమాత్రంబ కాని కాయంగ వెఱచు
నెంతమాత్రము కాసిన నెలమిఁ లొందుఁ
గేళిదీర్ఘికలందుఁ బంకేరుహములు. 6

మ. [1]పటుదిగ్వారణగండమండలలసత్ప్రత్యగ్రదానచ్ఛటా
కటుగంధం బగునీరు చిక్కనివియద్గంగాప్రవాహంబులో
పటిహైమాంబుజనాళముల్ పెఱికి యూడ్వం జేయు దేవా
ళిచే, నిటు దైతేయుఁడు కేళిదీర్ఘికలలో నిచ్ఛావినోదంబు
గన్. 7

తే. ఐంద్రమాసుర మాగ్నేయ మైలబిలము
వాయవీయ మైశానంబు వారుణంబు
యామ్యమును మున్నుగాఁ గల యష్టదిశలు
తాన కైకొని కైకోఁ డతండు సురల. 8

వ. ఇవ్విధంబునఁ దారకాసురుండు కాసరాక్ష తామ్రాక్ష
ధూమ్రాక్ష చతురోదగ్ర ఖడ్గరోమ బాలబిడాల కాలనేమి
ప్రధాననానాబంధుసహాయుండై పాకశాసనపావక పరేత
రాజ పలలాశి పాశి పవన పౌలస్త్య పన్నగాభరణులఁ బరి
భవించి నిర్జరులం దర్జించి కిన్నరుల వెన్నుసూచి కింపురుషులఁ
జంపి గరుడుల బడలుపఱిచి గంధర్వుల బంధించి గుహ్యకుల

---

1. పాఠాంతర మొకానొక ప్రతిలో :
ఇటు దైతేయుఁడు కేళిదీర్ఘికలలో నిచ్ఛావినోదార్థమై
యటవృత్తిఁ గనకాబ్జముల్ పెఱికి పాయం దెచ్చి నాఁటింపఁగాఁ
బటుదిగ్వారణగండమండల లసత్ప్రత్యగ్రదానచ్ఛటా
కటుగంధంబగ నీరచిక్కని వియద్గంగా ప్రవాహంబులోన్.

సంహరించి యక్షుల నధిక్షేపించి ఖేచరులఁ గీటడంచి యచ్చ
రల హెచ్చు గుందాడి సిద్ధులకు బుద్ధిసెప్పి సాధ్యుల
సాధించి మహారాజికులరాజసం బుడిపి విద్యాధరుల నధఃక
రించి మహాఋషుల నదలించి పితరులఁ బ్రతిబంధించి వసు
వులఁ బరిమార్చి రుద్రుల కుపద్రవం బాపాదించి విశ్వేదేవ
తల కనాశ్వాసంబు సేసి యనశ్వరం బగు నైశ్వర్యంబున
నప్రతీపం బగు ప్రతాపంబున నవార్యం బగు వీర్యంబున
నవక్రం బగు పరాక్రమంబున నస్తోకం బగు [1]వివేకంబున
నేకాతపత్రంబుగాఁ ద్రిలోకంబు లేలుచున్న కొంతకాలం
బునకు. 9

సీ. అనువు దప్పిరి నొచ్చి రలసి రాపద నొంది
రదవద లైరి చీకాకుపడిరి
యంగలార్చిరి విచ్చి రాఱడిఁ బొందిరి
భ్రమసిరి పాఱిరి పల్లటిలిరి
బెగ్గడిల్లిరి పికాపిక లైరి సొలసిరి
కులకులఁ గూసిరి కుతిలపడిరి
గగ్గులకా లైరి కలఁగి రోటాటిరి
వెలవెల్ల నైరి నివ్వెఱఁగుపడిరి
తే. యసవుసవు లైరి గుజగుజ యైరి డస్సి
రొల్లఁ బోయిరి వెగ్గిరి తల్లడిలిరి
సిగ్గువడి రొచ్చవడిరి [2]యిస్సిస్సి యైరి
తారకునిచేత మునులు బృందారకులును. 10

1. ఉత్సేకంబున. 2. యిస్సియిసి యైరి.

ఉ. ఇట్టినిషేధంబునఁ ద్రివిబుధు లెప్పుడునుం గనుఁగాపులట్లు ము
వ్వెట్టియుఁ జేసిచేసియును వేసరి యింద్రుఁడు మున్నుగాఁగ ది
క్పట్టిటు లున్నమా కనుచు నేఁగికి పద్మజుఁగూర్చి యేఁగి కూ
పెట్టిరి హస్తముల్ మొగిచి పెద్దయెలుంగునఁ దద్గుణస్తుతుల్.

వ. జయ జయ జగన్నాథ! జగజ్జననస్థితిసంహారకర! జంభారిప్రముఖనిఖిలబర్హిర్ముఖ శిఖామణిమయూఖమంజరీరంజితపాదపీఠ! జలజాసన! జాహ్నవీప్రముఖ సకలతీర్థతీర్థసంపూర్ణస్వర్ణకమండలుధర! జపతపోనిష్ఠాగరిష్ఠమునిమనోధిష్ఠాన! ఋగ్యజుస్సామాథర్వణమయనానానిశ్వాస! హిరణ్యగర్భ! భూర్భువస్సువస్త్రయీశుకీపంజర! నిరంజన! భారతీవిహారసౌధాయమానచతుర్వదన! సనాతన! సనత్కుమారజనక! శతానంద! శాశ్వత! విశ్వతోముఖ! నిర్వికల్ప! నిరీహ! నిరాకార! ఓంకారగమ్య! అదిగ్దేశకాలవ్యవచ్ఛేదనీయ! ఆదిమధ్యాంతశూన్య! అవ్యయ! అవాప్తసకలకామ్య! అనంత! అద్వితీయ నిరస్తసమస్తోపాధిక! సచ్చిదానంద స్వరూప! నమస్తే నమస్తే నమః. 12

సీ. సృష్టికి నటమున్న చిన్మాత్రసంశుద్ధిఁ
గేవలాత్మత్వ మంగీకరించి
పిమ్మట మూర్తిప్రభేదంబు వహియించు
గుణసంవిభక్తి కారణము గాఁగ
నీళ్లలో నూఁది తీ నిఖిల ప్రపంచమై
పెరుఁగంగఁ జాలిన బీజ మొకటి
మూఁడవస్థల జగంబున కుద్భవస్థితి
సంహారములు కేలి సల్పు దేవ

తే. నీదునిట్టూర్పు గాడ్పులు నిగమపఙ్క్తి
ప్రణవమంత్రాక్షరము నీకు భద్రపీఠి
విలయకాలంబు నీనిద్ర విశ్వమునకు
నీప్రబోధంబ యుదయంబు నిఖిలమునకు. 13

తే. అవధరింపుము విన్నపం బాదిపురుష!
యవధరింపుము మమ్ము లోకాధినాథ!
తడవు సేయక రక్షింపు తమ్మిచూలి!
తారకుఁడు మమ్ముఁ బెక్కుదుర్దశలఁ బెట్టు. 14

చ. పడితిమి కుక్కలుం బడనిపాటులు దుర్భర మైనవృత్తి వె
న్బడితిమి గర్భయాచకులభంగి దరిద్రత నట్టుకొంచు లోఁ
బడితిమి పాలలోఁ బడినబల్లులకై వడి నెల్ల వెంటలం
జెడితిమి వేయు నేల సరసీరుహసంభవ! దుష్టదైత్యుచేన్.

తే. తారకుం డెవ్విధంబున ధ్వంస మొందు
నెట్టు బ్రదుకుదు మేము మా కేది దిక్కు
చిత్తగింపుము దేవ! సంశ్రితజనార్తి
హరణపారీణ! కరుణారసార్ద్రహృదయ! 16

వ. అని కరుణంబుగా విన్నవించినహిరణ్యగర్భుండు ప్రసన్నుండై
బృందారకులను మహర్షులనుం గనుంగొని యి ట్లనియె. 17

సీ. వెఱవకుం డింద్రాదివిబుధ పుంగవులును
శాండిల్యభృంగాదిసంయములును
నస్మద్వరప్రభావానుభావంబున
వాఁ డింతవాఁ డయ్యె వాఁడి మిగిలి
విషవృక్ష మేనియు వృద్ధిఁ బొందఁగఁ జేసి
తనకుఁ గాఁ బెఱుకుట తగవు గాదు

పార్వతీదేవికి భవున కుద్భవ మైన
తేజంబు వాని [1]మ్రండింపఁ గలదు
తే. తండ్రి యగుదక్షుమీఁద క్రోధంబువలన
యోగ నిర్ముక్తదేహ యై యుద్భవించి
పెరుఁగుచున్నది హిమభూమిధరగృహమున
నమ్మహాదేవి శివుఁ జూప్పఁ డను వెఱింగి. 18

వ. ఇంతనుండియు మీకు మేలయ్యెడుఁ బొం డని పురందరాది బృందారకుల వీడు కొల్పి శతానందుండు యథోచితవ్యాపారంబులం బ్రవర్తిల్లు చుండె నిట్లు దేవతలు భావిశుభసూచకంబు లగు గంధవాహాదినానానిమిత్తంబు లనుసంధించుచు నిజస్థానంబుల కరిగిరి యనంతరంబున. 19

సీ. అటమున్న దక్షకన్యక తండ్రితో నల్గి
యోగమార్గమున మే నుజ్జగించి
యపరజన్మంబున నజ్ఞాతయోని యై
[2]యోషధులకు నెల్ల నునికిపట్టు
మేరుమందరవింధ్యపారియాత్రాదిసు
ప్రథితాద్రిసంబంధబాంధవంబు
నైనసీహారశైలాధినాథునకును
బితృదేవతలకన్నబిడ్డ యైన
తే. మేనకాదేవి కుదయించె మేలువేడ్క
నబ్ధిచెలికాఁడు మైనాకుఁ డన్న గాఁగ

1. వర్ణింప. 2. అఖిల భూభరణ క్రియాక్షమంబు.

నభిజనాఖ్య పార్వతి యన నఖిలజనని
యాదిశక్తి పురారియర్ధాంగలక్ష్మి. 20

క. [1]స్థావరజంగమభువనశు
భావహ మై విశదదశాదిశాంతర మై యీ
దేవి యుదయంబు నొందిన
యావేళం గుసుమవర్ష మంతటఁ గురిసెన్. 21

తే. జనని నిష్ఫుల్లలతాభ మౌచాయ గలిగి
క్రొత్త యుదయించినట్టియాకూఁతువలనఁ
గాపు కాలంబుమణిశలాకయును బోలె
నొప్పెడువిదూరభూమికి యుద్ధి యయ్యె. 22

వ. అనంతరంబ ప్రతిదినవర్ధమాన యై లబ్ధోదయ యగుచంద్ర
రేఖయుంబోలె బంధుజనంబునకుఁ బ్రమోదంబు సంధించుచు
మందాకినీసైకతవేదికాస్థలంబులఁ గందుకక్రీడ సల్పుచు
నుపదేశకాలంబుల విద్యలు నేర్చుచు బాల్యంబుఁ గడపి
నేత్రోన్మీలనంబు సేసిన చిత్రంబునంబోలె యౌవనవిభక్తం
బై యభ్యుదయం బై యభ్యున్నతాంగుష్ఠనఖప్రభావిశేషం
బున రాగంబు వెడలం గ్రక్కునవియుం బోనిచరణప్రవాళం
బులు వృత్తానుపూర్వంబు లై యనతిదీర్ఘంబు లగు జంఘా
ప్రకాండంబులును వేదండశుండాదండంబులకు వైదండికంబు
లై యొప్పారు నూరువులును మేఖలాకలాపమధ్యకీలిత
మహేంద్రనీలమాణిక్యకిరణరేఖయుంబోలె నాభిరంధ్రంబు
నం బుట్టి మీఁదికి నిగుడ రాజిల్లురోమరాజియును నవయౌవ
నారోహణార్థంబు మన్మథుండొనర్చినమణిసోపానంబులంబోని
వళ్లి విభంగంబులును గుచుల్లు నిండఁ బలుకం బండిన మా

1. పావన.

రేగుపండ్లగారాముఁ జెఱుచు గబ్బిగుబ్బల బెడంగులును
నభినవశిరీషకుసుమసుకుమారంబు లగుబాహువులును ధర్మ
బంధురం బగుకంధరంబును సంపూర్ణపూర్ణిమా చంద్రబిం
బంబు డంబు విడంబింపం జూచునాననంబును గావి యగు
మోవియును నూఁబూవువంటి నాసికయు నిద్దంపుటద్దములకుఁ
దోడిముద్దు లగుముద్దుచెక్కులును సుమకోదండవల్లీమతల్లు
లగుకఱివంక బొమలును విదియనాఁటి చందురునకుం గదిసి
చుట్టం బగులలాటపట్టంబును గొదమతుమ్మెదచాలుఁ బురు
డింపం జాలు నీలాలకంబులును నొప్ప సర్వోపమాద్రవ్య
సముచ్చయం బగుసౌందర్యంబు నేకత్రావస్థానదిదృక్షచే
విరించి సూక్ష్మీకరించి యథాప్రదేశనివేశితంబుగ నొనర్చినో
యనం దల్లిదండ్రులకు నామోదంబు నాపాదించుచుండ
నొక్క నాఁడు నారదుండు సనుదెంచి. 23

క. త్రిభువనమోహన యగున
య్యిభగమనం జూచి పర్వతేశ్వరునిమహా
సభలో ని ట్లని పలికెను
శుభవచనప్రౌఢి మెఱయ సురముని యెలమిన్. 24

సీ. ఈనీరజాతాక్షి మేనిలో సగపాలు
గణుతింప మగ పాలు గాఁగ నున్న
దీపల్లవాధరశ్రీపాదపద్మంబు
నొరయు నొక్కొక్కమా టుడుగణేశుఁ
డీకాంతతోడ మందాకినీవాహిని
సవతి గాఁ గల దేమిచందమునను

రేడుపండ్లగారాముఁ జెఱుచు గబ్బిగుబ్బల బెడంగులును
నభినవశిరీషకుసుమసుకుమారంబు లగుబాహువులును ధర్మ
బంధురం బగుకంధరంబును సంపూర్ణపూర్ణిమా చంద్రబిం
బంబు డంబు విడంబింపం జూచునాననంబును గావి యగు
మోవియును నూఁబూవువంటి నాసికయు నిద్దంపుటద్దములకుఁ
దోడిముద్దు లగుముద్దుచెక్కులును సుమకోదండవల్లీమతల్లు
లగుకటివంక బొమలును విదియనాఁటి చందురునకుం గదిసి
చుట్టం బగులలాటపట్టంబును గొదమతుమ్మెదచాలుఁ బురు
డింపం జాలు నీలాలకంబులును నొప్ప సర్వోపమాద్రవ్య
సముచ్చయం బగుసౌందర్యంబు నేకత్రావస్థానదిదృక్షచే
విరించి సూక్ష్మీకరించి యథాప్రదేశనివేశితంబుగ నొనర్చెనో
యనం దల్లిదండ్రులకు నామోదంబు నాపాదించుచుండ
నొక్క నాఁడు నారదుండు సనుదెంచి. 23

క. త్రిభువనమోహన యగున
య్యిభగమనం జూచి పర్వతేశ్వరునిమహా
సభలో ని ట్లని పలికెను
శుభవచనప్రౌఢి మెఱయ సురముని యెలమిన్. 24

సీ. ఈనీరజాతాక్షి మేనిలో సగపాలు
గణుతింప మగ పాలు గాఁగ నున్న
దీపల్లవాధరశ్రీపాదపద్మంబు
నొరయు నొక్కొక్కమా టుడుగణేశుఁ
డీకాంతతోడ మందాకినీవాహిని
సవతి గాఁ గల దేమిచందమునను

గస్తూరికాకురంగజనాభిపరిమళ
 శ్లాఘ్యేందుకాంతపాషాణతలముఁ
గిన్నరద్వంద్వసంభిన్నపంచమరాగ
 [1]మూర్ఛనులాపసమ్మూర్ఛితంబు
నిర్యన్మహావేగనిర్ఝరీఘాత్కార
 ఘుమఘుమాయితదిశాగోళకంబు

తే. నైనహిమశైలపాదంబునందు నియతిఁ
దపముసేయంగ మదిలోనఁ దలఁచి విడిసెఁ
బ్రమథవర్గంబుఁ దానును బసవఁ డపుడు
కృత్తివాసుండు విషయనివృత్తుఁ డగుచు. 30

తే. ప్రమథు లెల్లరు విడిసి రప్పర్వతమునఁ
జంద్రకాంతశిలామణిస్థలములందుఁ
నమరియుండు నమేరువృక్షములనీడ
భూర్జతరుచర్మపరిధానములు ధరించి. 31

చ. బసవఁడు ఱంకె వైచి హిమపర్వతచారువనాంతరంబులం
బసిరిక మేసి నిర్ఝరులఁ బాఱెడుతియ్యనినీరు గ్రోలి క్రొ
వ్వెసఁగ ఘనాఘనధ్వనుల నుల్లస మాడెడుఁ [2]దద్వనంబునన్
బ్రసభగతిన్ మృగేంద్రములుభద్రగజంబులు భీతిఁ జెందఁగన్.

తే. ఆత్మమూర్త్యంతరం బైనయగ్ని దేవు
నర్చనము సేసి నియతి నష్టమూర్తి
బహుతపోవ్రతనియమైకఫలవిధాత
తపముఁ జేసెను మది నొక్కతలఁపుఁ జేసి. 33

1. నిర్యన్మహావేగ నిర్ఝరాంబు, పతితప్రతిధ్వానభంగోరు ఘుమఘుమ, ఘుమ ఘుమాయిత... 2. ధత్పురంబునన్.

తే. అపుడు హిమవన్నగేంద్రుఁ డత్యాదరమున
నతిథియై యున్నశంభున కర్ఘ్య మిచ్చి
తత్సమారాధనక్రియార్థమునఁ బంచె
నిజతనూజ సఖీసమన్వితము గాఁగ. 34

క. రమణి తపోవ్రతచర్యా
సమధికవిఘ్నం బ యనుచుఁ దలపోసియు శీ
ఘ్రము గైకొనె శివుఁడు వికా
[1]రము లుత్తమమతుల కెట్లు రాఁగా నేర్చున్. 35

సీ. [2]పాటించి పువ్వులు పల్లవంబులుఁ గోయుఁ
గుశపవిత్రంబులుఁ గూడఁబెట్టు
నాపగ రహి మీఱు నర్ఘ్యోదకములును
నుపకరణంబులు నొయ్యఁ జేర్చు
వేదికాసమ్మార్జనవిధి నివర్తించును
లీలమై రంగవల్లిక లొనర్పుఁ
గల్పించు లెస్సగా గంధాక్షతంబు ల
త్పాదించు ధూపదీపాదికములు

తే. ప్రత్యహంబును హిమధరరాజతనయ
భవునిపదపద్మములమీఁద భక్తి గలిగి
తచ్ఛిరశ్చంద్రచంద్రికాస్తబకశైత్య
శాంతపర్యటనక్రియాశాంతి యగుచు. 36

వ. అక్కాలంబునం దొక్కనాఁడు స్వర్గలోకంబునఁ బాకశాస
నుండు కల్పానోకహంబులనీడలఁ జింతామణి వేదికాస్థలంబు
లందు బృందారకులు పరివేష్టింపఁ బేరోలగం బుండి దివిజ

1. రము లేక మదిం దపంబు రమణీమణియున్. 2. పాటించుఁ.

కార్యార్థసంసిద్ధిఁ బొంద మనంబునందుఁ గందర్పునిం దలం
చిన. 37

సీ. కాంతాజనంబుల కలికివంకబొమలతోఁ
బ్రతివచ్చు పుష్పచాపంబుతోడఁ
గోకిలవ్రాతంబు గ్రుక్కిళ్లు మ్రింగించు
క్రొమ్మావి చిగురాకుగొడుగుతోడఁ
రతిదేవినిడుసోగఁ గ్రాలుకన్నులఁ డాలుఁ
దలపించు మీనకేతనముతోడ
భుజగలీలావతీభుక్తశేషము లైన
గంధవాహకిశోరకములతోడఁ
తే. జందురునితో వసంతమాసంబుతోడ
రాజకీరరథం బెక్కి ప్రాభవమున
వచ్చె వలరాజు చిత్తానువర్తనముగ
సంభ్రమముతో మహేంద్రు నాస్థానమునకు. 38

ఉ. పక్షము పెంపునం గుసుమబాణునిమీఁద నె వ్రాలె దేవతా
ధ్యక్షునివేయికన్నులును దక్కినవేల్పుల నుజ్జగించి సూ
క్ష్మేక్షికఁ జూడఁ గార్యగతి యిట్టిదయా ప్రభువుల్ ప్రయో
జనా, పేక్ష నొకప్పు డాశ్రితుల [1]కీరె సముంచితగౌరవోన్న
తుల్. 39

క. రా యిటు రమ్మని చేతికిఁ
జే యిచ్చి ప్రమోదరేఖ చిగురొత్త మహ
న్నాయకుఁడు నిల్పె సుమన
స్సాయకు సరిగద్దెమీఁద సౌహార్దమునన్. 40

1. పేర.

వ. అప్పుడు. 41

తే. పతిప్రసాదంబుఁ దనమౌళిపై ధరించి
మహితవినయావనమ్రుఁడై మన్మథుండు
సంగతంబుగ హస్తాంబుజములు మోడ్చి
విస్ఫురోక్తుల నిట్లని విన్నవించె. 42

వ. దేవర నన్నుఁ దలంపున నవధరించిన కారణం బేమి యానతిమ్ము. 43

సీ. ఎవ్వండు నీపదం బెలమి నుద్దేశించి
యతిఘోర మగు తపం బాచరించె?
నెవ్వఁడు నీచిత్త మెరియించుచున్నాఁడు
కైవల్యపదవికైఁ గాలుసాఁచి?
యెవ్వండు గురునీతి కేపాకమును బొంద
కుద్దండరీతి మాఱొడ్డి నిలిచె
నెవ్వండు దంభోళిహేతిని క్షురధారఁ
దలఁచె నీలోత్పలధారఁ గాఁగ

తే. వాని భంజింతు నాతనిమాన మడఁతు
నతని నిర్జింతు నాతని నతకరింతు
నానతిమ్ము మహేంద్ర! నాయట్టిహితుఁడు
నీకుఁ గలుగ నసాధ్యంబు నెగడు నెందు. 44

తే. ఏకభర్తృవ్రతస్థయై యేలతాంగి
నీకుఁ [1]జేయాకధర్మంబు నిలువరించె
నది వినిర్ముక్తలజ్జయై యమరరాజుఁ
జేయుఁ గాత స్వయంగ్రహాశ్లేషణంబు. 45

---

1. జేయాఁడు.

తే. ప్రణయకోపప్రశాంతికై పాదపతితు
నిన్ను నేపువుఁబోఁడి మన్నింపదయ్యె
నాలతాంగిఁ బ్రవాళశయ్యాశరణ్య
దేహఁ గావింతు వినుము సందేహ [1]మింద్ర. 46

క. నీవజ్రము సుఖముండుం
గావుత దివ్యాస్త్రశాలికామధ్యమునన్
దేవేంద్ర! చెఱకువింటం
బూవులు శరములుగ నే రిపుల నిర్జింతున్. 47

వ. నీప్రసాదంబున మలయానిలంబుప్రాపును వసంతంబుసహాయం
బును నిండువెన్నెల చెలిమియుం గలుగఁ బినాకపాణి యగు
హరు నైన జయింపం జాలుదు నని తలంతుం దక్కినవారు
నాకెవ్వరు నెంత యని యుత్సాహంబునం బల్కినం బురం
దరుండు సంకల్పితార్థంబు సఫలం బయ్యె నని యంతరంగం
బున సంతోషించుచుఁ గంతున కి ట్లనియె. 48

సీ. సంకల్పసంభవ సమరకూర్తు వట్లనే
యరుగంగ నీ కసాధ్యంబు గలదె
యటు గాన కానిమహాకార్యభరమునం
దేము నియోగింతు మిపుడు నిన్ను
ధరణిభారధురీణతాప్రౌఢిఁ గని కదా
తను మోఁచుశేషునిఁ బనిచెను హరి
విబుధకార్యార్థంబు విశ్వేశ్వరుగుఱించి
యరుగంగవలయు నీ వధికభక్తిఁ

---

1. మూద్ర.

తే. గుధరకన్యను శశిమౌళిఁ గూర్పవలయుఁ
బార్వతీపరమేశ్వరప్రభవ మైన
దివ్యతేజంబు సేనాపతిత్వ మొంది
జయముఁ గావించు నని చెప్పె జలజభవుఁడు. 49

వ. హిమాద్రిపాదంబున దేవదారువనంబున నియతాత్ముఁడై పరబ్రహ్మానుసంధానంబు సేయుచు నంధకారాతి తపంబు సేయు చున్నవాఁడు పార్వతియు హిమవన్నియోగంబున నీశ్వరునకుం బాయక పరిచర్య సేయు చున్నయది యీ వార్త సకలలోకవృత్తాంతవిజ్ఞానార్థంబు పంపిన యప్సరస్స్త్రీప్రణిధివర్గంబువలన వింటి నిది కార్యక్రమంబు. 50

తే. ఇది యనన్యసాధారణ మిది యవశ్య
మిది పరోపకృతిక్రియాభ్యుదయశాలి
చేయు మిప్పని సంకల్పసిద్ధి గాఁగ
బాహువిక్రమపారీణ! పంచబాణ! 51

తే. కోరి యభ్యర్థనము సేయువారు సురలు
కార్య మూహింప మూఁడులోకములకును
[1]నతిశుభము కృత్యమో యల్పమైనఁ గాదు
కామసంస్పృహణీయవిక్రముఁడ వీవు. 52

వ. హుతాశనునకు సమీరంబుంబలె మధుమాసంబు సహాయంబుగుం గాత మర్థలాభంబును సేమంబును బునర్దర్శనంబు నయ్యెడు మని దీవించిన దేవేంద్రుని యానతి ముత్యాల సేసఁ బోలె శిరంబునఁ దాల్చి యైరావణకుంభికుంభాస్ఫాలన కర్కశం బగుకరంబున వాసవోప్పతి తన్ను సంస్పర్శించి గౌర

1. గర్భమున హింస పలమైనఁ గానరాదు.

వించిన మన్మథుండు మధుసహాయుండై హిమత్పర్వతంబు
చేరం జనియె నాసమయంబునందు. 53

చ. సకలవనంబులందుఁ గలసంయమికోటి తపస్సమాధిని
ష్ఠకుఁ బ్రతికూలవర్తి యయి షట్పదకోకిలరాజకీరజా
లకములతోడఁ గూడ ఝషలాంఛను నెచ్చెలికాఁడు వచ్చె
వారక మధుమాసరాజు నవరాగసమంచితపల్లవాస్త్రుఁడై.

తే. ఉత్తరాభిముఖుండై నయుష్ణరశ్మి
చంద మీక్షించి దక్షిణాశాపురంధ్రి
గంధవాహంబు దీర్ఘదీర్ఘంబు గాఁగఁ
జాఁగ విడిచెను విరహనిశ్వాసధార. 55

శా. ఆమూలాగ్ర మశోకపాదపము ప్రత్యగ్రప్రవాళావళి
వ్యామిశ్రంబుగఁ బూచె నప్పు డటు నీహారాద్రికుంజంబునన్
భామాకోమలపాదపంకరుహసంపర్కం బపేక్షింప కు
ద్దామం బై నవసంతజృంభణము సత్త్వం బొప్ప దీపింపఁగన్.

తే. చివురుగఱితోడ లేమావిపువ్వులు శరముఁ
జేసి మధుమాసకాలంబు చిత్తజునకు
నళికులంబులవేర నామాక్షరములు
మసితో నిల్పె ననఁ బొల్చె వానియందు. 57

క. నవకము లగుములుమోదుపుఁ
బువుమొగ్గలు విపినవీథిఁ బొల్పెసలారెన్
దివుట వసంతుం డనుప
ల్లవుఁ డిడిననఖక్షతంబులకు సరి యగుచున్. 58

తే. చెమట కింపురుషస్త్రీలచెక్కులందుఁ
గ్రమ్మి మృగనాభిపత్త్రభంగంబుఁ గరచెఁ

జంపనద్రవ మిం పయ్యెఁ జన్నుఁగవకు
నలుకఁ బన్నిటితో గుహ్యకాంగనలకు. 59.

వ. అప్పుడు వనౌకసు లగు తాపసు లతిప్రయత్నసంస్తంభిత క్రియారంభులును మదనుండు సమారోపిత పుష్పచాపుం డును మధుకరంబులు కుసుమపాత్రపరిపూర్ణ మధురసగం డూషసముపలాలిత ప్రియాసందోహంబులును మృగంబులు మృగీకండూయనపరాయణంబులును నై యుండిరి వెండియు,

ఉ. పంకజరేణుగంధి యగుపల్వలవారిఁ గరేణు విచ్చె ని
శ్శంక మదావళంబునకు గంధగజంబును బద్మినీమృణా
లాంకుర మర్ధభుక్తము నిజాంగనకుం బ్రియమార నిచ్చె నా
వంకఁ దపోధనుల్ హృదయవత్సలతన్ బ్రియ మంది చూడఁ
గన్. 61

ఉ. దేసికగాన(ని)మార్గములఁ దిన్నని రీతులఁ బాడిపాడి యా
శ్వాసము నొంది సోలి యరవాడినయంగన మోముదమ్మిఁ బు
ష్పాసవఘూర్ణితేక్షణము లల్లనఁ జుంబన మాచరించి యు
ల్లాస మొనర్చెఁ గిన్నరవిలాసి హిమాచలకందరంబునన్. 62.

తే. అచ్చరలు పాడుహిందోళ మాలకించి
యిందుమౌళి ప్రసంఖ్యాన మెడలఁడయ్యె
నిర్జితేంద్రియు లైనట్టినియమపరుల
నంతరాయంబు లేమి సేయంగఁ గలవు? 63.

వ. అప్పుడు వామప్రకోష్ఠార్పితహైమవేత్రకుం డగునందికేశ్వ రుం డభినవవసంత సమయారంభసంభూత మనోవికారంబు లగు ప్రమథవీరులభావంబులు భావించి హుంకారంబు నేసి. మాను మని యదల్చిన నాశిలానందనుదివ్యశాసనంబునఁ

గానను బెల్ల నిష్కంపవృక్షంబును నిభృతద్విరేఫంబును మూకాండజంబును బ్రశాంతమృగచారంబు నై చిత్రార్పితావస్థానంబునుంబోలె నుండె నేనియు మనోభవుండు ముక్కంటిమొదురుఁజక్కటి గాని యొక పక్కియఁగాఁ బురశ్శుక్రంబు నడచువాఁడునుంబోలె మనంబునం జంకుచు నెట్టకేలకు నాజగజెట్టి తపంబు సేయు చలికొండచట్టుపట్టు నకుం జను దెంచి చుట్టునుం దిరిగియున్న సురపొన్న మోకల నీడ నిల్చి యచ్చోట శార్దూల చర్మంబునం బర్యంకబంధురిత పూర్వకాయుండును నుత్తానపాణియుఁ బ్రాణాయామపరుం డును నగు నమ్మహాదేవునిపార్శ్వంబునం బుష్పాంజలి వట్టి ధ్యానావసానావసరముం బ్రతీక్షించుచుఁ గించిద్విలంబమాన కేసరభరా(-ఫదా)భిరామకాంచీకలాపయుఁ గర్ణికార కుసు మతాటంకయుఁ బల్లవావతంసయు నగుపార్వతిం గనుంగొని యిదియ నాకవసరం బని యధిజ్యశరాసనుం డై. 64

సీ. వలుద కెంజడకొప్పు వదలి వీడకయుండఁ
బెనుపాఁపతలపాగ బిగియఁజుట్టి
మెడకప్పుతోఁ గూడి మిక్కిలి నలు పైన
కమనీయకృష్ణాజినము ధరించి
భ్రూవికారము లేనిపాడవు ఱెప్పలలోని
ఘనదృష్టి నాసికాగ్రమున నిల్పి
యోగపట్టికఁ జెంది యొఱ పైననిలుకడ
నాసనస్థితబంధ మనువుపఱచి
నిస్తరంగక మైనమున్నీరుపోలె
గర్జితము లేనిఘనఘనాఘనముపోలె

ధ్యాననిశ్చలుఁ డగునిందుధరునిఁ జూచి
ప్రసవనారాచుఁ డతిభయభ్రాంతుఁ డగుచు. 65

ఉ. ఒయ్యన డాయఁగాఁ జనియె నుగ్రవిలోచను పార్శ్వభూమి
కిం, దయ్యముఁ జేఁడునెచ్చెలి యెదన్ భయకంపము నుప్ప
తిల్లఁగాఁ, దియ్యనివిల్లుఁ బుష్పములఁ దీర్చినయమ్ములు శౌర్య
సంపదల్, వయ్యము గాఁగ భూమిఁ బడ వైచె నిలింపులు
చూచి బెగ్గిలన్. 66

క. స్థావరరాజతనూభవ
యావేళన డాయ వచ్చె నభవునిసేవా
హేవాక ప్రౌఢిని వన
దేవత లెంతయును నభిరతిం దనుఁ గొలువన్. 67

తే. పద్మరాగవిభూషణప్రతతిమాఱు
లలి నశోకలతాప్రవాళములు దాల్చి
సింధువారప్రసూనరాజీవరాజిఁ
గమ్రమౌక్తికరత్నశృంగార యగుచు. 68

చ. చనుఁగవవ్రేగునన్ మిగులసన్నపుఁగౌ నసియాడఁ గెంపుమీ
ఱిన నునుఁబట్టుఁజేలఁ గటిఱింగులు వాఱఁగఁ గట్టి భూమిభృ
త్తనయ ప్రసూనగుచ్ఛములు దాలిచి లేఁజిగుఱుల్ ధరించి వ
చ్చిన నడతీవవోలె నిలిచెం దమ జేందుకిరీటుసన్నిధిన్. 69

తే. తరుణి యందందుఁ గేసరదామకాంచి
జఘనపులినంబు నందుండి జాఱిపడఁగ
మాటిమాటికి హస్తపద్మముల నెత్తు
చపలభావంబుతో నుండె నభవుమ్రోల. 70

ఉ. కమ్మనియూర్పుగాడుపులగుంపునుఁ గ్రోలఁగ వచ్చి యోష్ఠ
బింబముసమీపదేశమునఁ బాయక యాడెడు తేఁటి గేళిప
ద్మమున మాటిమాటికి సమంచితవిభ్రమలోలదృష్టి యై, యమ్మ
దిరాక్షి [1]చోఁపె దరహాసవికస్వరగండపాళి యై. 71

తే. అఖిలలక్షణసంపూర్ణ యైనయట్టి
యాలతాతన్విఁ జూచి పుష్పాయుధుండు
[2]రమణఁ దాఁ బూను దేవతారాధనంబు
సఫలతం జెందె నని చాల సంతసిల్లె. 72

ఉ. అప్పుడు డాయ వచ్చెఁ దరుణాబ్జకళాధరు గౌరి భక్తితో
నప్పుడు డాసె నీశ్వరుఁడు నంచితయోగసమాధినిష్ఠ యై
దప్పక బాహ్యసీమఁ బ్రమదం బెసఁగం బరమంబు సోహ మై
యొప్పెడు దివ్యతేజము సముజ్జ్వలకోటితటిత్ప్రకాశమున్.

క. అసమభయభక్తు లలరఁగఁ
గుసుమంబులు దోయిలించి కోమలి నించెం
గిసలయభంగంబులతో
నసదునడుము వణఁక మృడునియడుగులమీఁదన్. 74

ఉ. పల్లవపుష్పభంగములు పాదసరోరుహయుగ్మకంబుపైఁ
జల్లి శ్రవోవతంస మగుచంపకమొగ్గ యొకింత జాఱఁగా
నల్లన మ్రొక్కెఁ బార్వతి భయంబును భక్తియు సంభ్రమంబుసం
ధిల్లఁగ భావి భర్తకు ఫణిప్రభుహారున కంధకారికిన్. 75

క. సరిలేనిమగనిఁ బడయుము
తరుణి యని పల్కె శివుఁడు తథ్యమ యిది యా

1. చిమ్ము. 2. దానుబూనిన దేవతార్థ మఖిలమును.

శ్వరభాషితమునకుం దర
తరములయందైన నన్యథాత్వము గలదే. 76

ఉ. పంచశరుండుఁ దత్పరత బాణవిమోక్షణకాలముం బ్రతీ
క్షించుచు గౌరి శంకరునిఁ జేరినయప్పటినుండి యెప్డు మ
న్నించునొకో హరుండు తరుణీమణి నంచును వింటనారి సా
రించుచు నుండెఁ జెంత [1]నురరీకృతదైవతకార్యధుర్యుఁ డై.

తే. ప్రియము శోభిల్లఁగా సమర్పించె గౌరి
పశుపపయ్యెద జాఱ దోఃపల్లవమున
భానుదీప్తులు నీటారి ప్రన్ననైన
పృథులమందాకినీపద్మబీజమాల. 78

తే. అంబుజాక్షి సమర్పింప నాదరమున
నక్షమాల్యంబు నిటలాక్షుఁ డందుకొనియెఁ
బంచబాణుండు సంధించె నించువింట
నస్త్రరాజంబు సమ్మోహనాశుగంబు. 79

మ. శమనారాతి నివృత్తధైర్యుఁ డగుచుం జంద్రోదయారంభకా
లమునం బొంగిన దుగ్ధసాగరములీలం బక్వబింబాధరో
ష్ఠముఁ గర్ణాంతవిలాసనేత్రము నతిస్వచ్ఛంబునై యొప్పు గౌ
రిముఖాంభోజమునందు నిల్పె సరసప్రేమంబునం జూడ్కులన్.

తే. శైలసుతయును భావంబుకీలు దెలిసి
యంగకంబులఁ బులకంబు లంకురింప
వ్రాల్చె నెమ్మోము లజ్జాభరంబుపేర్మిఁ
గేకరాలోకనంబులఁ గెల్లుమలఁగి. 81

---

1. నుస్థిరీకృత.

వ. అనంతరం బంతకమథనుం డతర్కితం బైన యింద్రియక్షో
భంబు బలాత్కారంబుగాఁ గుదియించి, చేతోవికారంబు
నకుం గారణంబుఁ దెలియం దలంచి దిశాంచలంబులకుం జూపు
పఱపునప్పుడు కట్టెదుర దక్షిణాపాంగనివిష్టముష్టియు నాత
తాంగుండును నాకుంచితసవ్యపాదుండును జక్రీకృతకార్ము
కుండును బ్రహితోద్యుక్తుండును నైన మన్మథునిం గనుం
గొని తపఃపరామర్శవివృద్ధక్రోధుం డయ్యె నవ్వేళ భ్రూభంగ
దుష్ప్రేక్షుం బగు విరూపాక్షునిలలాటేక్షణంబునం జనియిం
చిన సముజ్జ్వలజ్జ్వాలాజాలం బైనకృపీటయోని భువనంబు
లెల్ల భయభ్రాంతంబు లై హాహాకారంబులు సేయ నమ్మీన
కేతను శరశరాసనతూణీరంబులతోడంగూడ భస్మంబు చేసిన.

సీ. నాగభూషణుఫాలనయనానలము చేతఁ
బంచబాణుఁడు బిట్టు భస్మమయ్యెఁ
బ్రబలాభిషంగసంప్రభవమోహంబున
రతిదేవి యవశ యై వ్రాలె ధరణి
యువతిసంసర్గంబు యోగవిఘ్నం బని
యభవుఁ డంతర్ధాన మాచరించెఁ
జెలికాఁడు తనమ్రోల నొలికి బూడిద యైన
నామని యేడ్చె నా వఱచినట్లు
తే. గౌరి తనచారుసౌభాగ్యగౌరవంబు
విలువ పోయినచెలువున విన్నవోయెఁ
బర్వతేంద్రుండు నిర్విణ్ణభావ యైన
కూర్మినందన నింటికిఁ గొంచుఁబోయె. ౩౩

వ. అనంతరంబ రతీదేవి మోహాంధోన్మీలితంబు లైనలోచనం
బుల నత్యంతప్రియదర్శనుం డగుప్రియుం గానక పురుషా
కారంబున భూమిం బడియున్న భస్మంబుం గని యిట్లని
ప్రలాపింపం దొడంగె. 84

చ. చక్కనివారిలోన నెఱజాణలలో విటరాజకోటిలోఁ
జిక్కనివారిలోఁ గడు బ్రసిద్ధివహించిన నీవు ప్రాణముం
దక్కినచోట నీమనసు ధైర్యమున న్మిసిమింతురాలు గా
నక్కట! పుష్పసాయక! మహాకఠినాత్మలువో మృగేక్షణల్.

మ. ప్రతికూలాచరితంబు నావలన నల్పం బైనను గాంచితే
ప్రతికూలాచరితంబు నీవలన నల్పం బైన నేఁ గంటినే
కృత మెన్నండును లేనిచంద మిది లక్ష్మీపుత్ర! నీయందు న
న్నతిదుఃఖాన్విత డించి పోవఁ దగవా యథ్వానపుంబట్టునన్.

క. [1]తలఁతే మన్మథ! గోత్ర
స్ఖలితంబుల జఘనసూత్రకరబంధంబుల్
తలఁతె! మదీయవసంతో
త్పలకలికాబంధనంబుఁ దత్సమయములన్. 87

క. మెఱయంగ ముసురు కురియఁగ
నుఱుమం బురవీథులం బయోధరవేళం
దెఱవల రమణులయొద్దకు
నిఱుఁజీఁకటిదిశల నింక నెవ్వం డనుపున్. 88

1. తలఁచితె మన్మథ...తలఁచితె మఱియవతంసో...;...స్ఖలితంబుల తలఁతే మఱియు...కలికాబంధనంబు...ములన్.

సీ. మదిరారసాస్వాదమదవికారంబులు
బింబాధరలకు విడంబనములు
ప్రియవియోగంబున బెదరించువాఁ డయ్యె
నుతువల్లభుఁడు నిష్ఫలోదయుండు
కోయిల్లనోర్వారు క్రొత్తమామిడిమోక
నవపల్లవంబు బాణత్వ ముడిగె
శుకశారికలు గూడి శోకస్వరంబులఁ
బలవింప దొడఁగెఁ దాపంబు గదిరి

తే. మాసములు దుఃఖపడె మధుమాధవములుఁ
జిన్నిమలయానిలంబులుఁ జిన్నవోయె
మాట లేటికి వేయు నోమగలరాజ!
విశ్వమున నీవు లే కున్న వెలితి వడియె. 89

తే. హృదయమున నుండి యెప్పుడు హృదయనాథ!
ప్రియముఁ జెప్పెద నను జెల్ల భేషజంబు
హృదయమున నుంట నిజమేని మదన యెట్లు
భస్మమైతివి? నే నెట్లు బ్రదుకఁ గంటి? 90

వ. మన్మథ! మధురాలాపనిసర్గపండితంబు లగుగండుం గోయితల నేలొకో భువనంబులకు రాయబారంబు పంపవు? ప్రణిపాల యాచితంబు లగుగాఢోపగూహనంబులు మఱచితే? యార్తవం బగుకుసుమప్రధానంబు నాయంగంబులం దిది నీవు రచియించినది కదా? దక్షిణేతరం బగుమదీయచరణంబు లాక్షారాగపరికర్మంబునకుం దగదొకో? పతంగమార్గంబున నింగలంబునం బడి భవపంకం బాశ్రయించెదఁగాక మదనుండు లేక రతీదేవి జీవించు నను నపవాదంబు లోర్వ వచ్చునే! నీసుహృ

దీశ్వరుం డయిన వసంతుం డెచ్చట నున్నవాఁడు? పటు
క్రోధరేఖానటద్భ్రూభంగ విభీషణముఖుం డగులలాటలో
చనులోచనంబు చిచ్చున నతండును వెచ్చి నిన్నుఁ గూడెనే
యని యనేకప్రకారంబులం బలవింపఁదత్పరిదేవనాంకురంబులు
బాణపాతంబులంబోలి హృదయంబునఁ దూఱినాటుటయు
నెంతయునొచ్చి యమ్మధుమాసం బక్కిసలయకోమలికిం బుట్టిన
మహావ్యసనం బూరార్పం జేర వచ్చుటయు. 91

సీ. క్రొమ్ముడి శైథిల్యమునఁ బెక్కు కుసుమంబు లుమియుచు
నవటుప్రదేశంబునందుఁ బొరల
జేవురించిన లేఁత చెక్కుటద్దంబులఁ
దాటంక యుగళంబు తన్నియాడ
నాక్రోశపరిదేవనాంకురవ్రాతంబు
కంఠ గద్గదికచేఁ గ్రక్కుపడఁగ
హారినీలములచాయ నక్షిగోళమ్ముల
సొబగుగాఁ గన్నీటిసోన గురియ

తే. ముత్తియంబులపేరులు ముఱిసి పడఁగ
హస్తముల వీఁగుఁ జనుదోయి యడిచికొనుచు
సంబెరం బిచ్చె రతిదేవి శంబరారి
[1]కప్పుడు వసంతు నెదుట దుఃఖార్త యగుచు. 92

వ. ఇవ్విధంబున నారామ పేరామనియెదుట నెమ్మనంబునఁ
బేరామని యై వర్తిల్లునార్తి సంబెరం బిచ్చి సొమ్మసిలంబోయి
లేచి వసంతునిం గనుంగొని, మాధవ! నీ చెలికానిం జూడు
కపోతకర్బురం బైన భస్మం బైనవాఁడు! నీవు వచ్చుట

1. కమలినవసంతు.

యెఱుంగండు సుమ్మీ! ససురాసురం బైనజగంబు బిసతంతు గుణం బైనకోదండంబునం గలగుండ్లు వెట్టు నిట్టిజగజెట్టియుం గలండే? యతిపరుషపవనసంపాతాహతం బైనదీపమునుంబోలె నీపరమమిత్రుండు క్రమ్మఱిలండు సుమ్మీ! నాపాపంబునం జేసి విధి వెలిగాం గ్రొన్ననవిలుకానిం గొనిపోయె. నీవును బరమ మిత్రుండవు గావున నన్నును నగ్నిముఖంబున నీసఖుం గూర్పం బాడి. "శశితోడం గూడం గౌముదియు మేఘుంబు తోడంగూడ మెఱుంగు" ననుట సకల సమ్మతంబు. కుసుమ శరశరీరభసితచూర్ణంబు [1]శరీరంబునం దాల్చి నామేను విభా వసునందు [2]వేల్చెదం గిసలయతల్పంబులకు నిటమున్ను సహా యుండ వగునీకుం జితి పేర్పం జాలవచ్చెనే యని పల్కి శోకావేశంబున నెండియు. 93

సీ. హస్తయుగ్మము మోడ్చి ప్రార్థించి పలికెదం
        దమ్ముండా! నాకిమ్ముం దగం జితాగ్ని
మందమందంబుగా మలయానిలంబులు
        వెరవుతో మండంగ విసరుంగాతం
బరలోకకృత్యకై బంధు లిద్దఱకును
        ధర్మోదకం బిందు తమ్మితేనె
సహకారమంజరీచయపిండకబళంబు
        పెట్టుండు మాకు నై పికము ముట్టం
తే. దేనె పెట్టుండు కస్తూరి దీర్చి యచటం
జేరగొజ్జంగ పూనీటం జెంబు లిడుండు
నన్ను వలరాజుం దలంచి మన్నన దలిర్పం
దగ సమర్పణ చేయుండు దంపతులకు. 94

1. చనుంగవధరించి. 2. వెచ్చెదం.

వ. అని తెంపు సేసి యగ్నిప్రవేశంబున కాయితం బై యున్న సమయంబున రతి నుద్దేశించి యాకాశవాణి, యోమన్మథపత్నీ! సాహసంబు వలవ దుడుగుము. నీకుం జేరువన మేలు గాఁగలయది నీమగఁడు కందర్పుండు భుజాదర్పంబునం గన్నుఁ గానక కనకగర్భుని సమావిర్భూతమనోవికారునిం జేసి తనకుమారికయం దతనికిఁ గాఁగాని తలంపుఁ బుట్టించె. కన్నియం గవసిన తన యన్యాయంబునకుం దాన రోసి సరసిరుహాసనుం డీసునం బుట్టించినవాఁడు కుసుమశరుండుకదా! యద్దురాత్ముండు హరకోపానలంబున భస్మం బగుం గావుతమని శపించిన నది కారణంబుగాఁ బ్రద్యుమ్నున కిద్దురవస్థ తటస్థించె. 95

ఉ. ఎప్పుడు పెండ్లియాడుఁ బరమేశ్వరుఁ డద్రితనూజ వేడ్కతో
నప్పుడు లబ్ధసౌఖ్యుఁ డయి యంబికప్రార్థన నాసదాశివుం
డెప్పటియట్ల సర్వభువనైక ధనుర్ధరునిం బ్రియుం బ్రియం
బొప్పఁగ నిచ్చు నీకు మది నొందు తలంపకు నమ్ము మాత్మలోన్.

వ. అని యదృశ్యరూపం బైనభూతంబు రతీదేవి మరణ వ్యవసాయబుద్ధి మందీభవింపం జేసెఁ గుసుమాయుధబంధుం డగు వసంతుండును నావృత్తాంతంబునకు సంతసించి యక్కాంత నూరార్చె నాశాపాంతం బవలంబించి శంబరారి పత్నియు గౌరీకళ్యాణకాలమ్ముం బ్రతీక్షించుచు విరహక్షీణం బైన శరీరంబు రక్షించుకొనుచుండె నంత. 97

ఆశ్వాసాంతము

మ. మంకణమానివంశమణిమండన! కాంచిపురీనివాస! యే
ణాంక కిరీటదివ్యచరణాంబుజసేవక! వైరిభద్రనా
గాంకుశ! హారహీర దరహాసవిపాండురకీర్తిచంద్రికా
లంకృతదిగ్విభాగ! శుభలక్షణ! వారిరుహాయతేక్షణా! 98

క. శరదీపదానశోభిత
బిరుదాంకిత! యంబునిధిగభీరసుహృదయా!
హరచరణకమలపూజా
పరతంత్రస్వాంత! వంశపావనచరితా! 99

మాలిని. మాచమాంబాసుతా! మానదుర్యోధనా
యాచకాభీప్సితత్యాగచింతామణీ!
[1]ధీచతుర్వక్త్ర యాస్తిక్యసంపన్నిధీ!
లోచనాంభోరుహాలోలలక్ష్మీకళా! 100

గద్య. ఇది శ్రీమత్కమలనాభపౌత్ర మారయామాత్యపుత్ర
వినయవిధేయ శ్రీనాథనామధేయప్రణీతం బయిన హర
విలాసం బను మహాప్రబంధంబునందుఁ దృతీయాశ్వాసము.

---

1. ధీచతుర్వర్గయాస్తిక్యసంజన్నిధీ.

శ్రీ ర స్తు

# హా ర వి లా స ము

## చ తు ర్థా శ్వా స ము





కా వేరీవల్లభ !
లోక స్తవనీయ ! సర్వలోకా శ్ర య ! వ
ర్వీకరభూషణభ క్త ! సు
ధీకలితవి వేక ! యవచిదేవయతిహ్వా ! 1

వ. ద్వితీయవిలాసం బైనగౌరీకల్యాణం బాకర్ణింపుము. 2

తే. అవ్విధంబునఁ వనమ్రోల నసమశరుఁడు
తనకుఁగా నీశ్వరునిచేత దగ్ధ మైన
ధరణిధరకన్య నిందించెఁ దనదురూపుఁ
"బతులు మెచ్చని చెలువు నిష్ఫలము కాదె." 3

వ. అనంతరంబ వసుంధరాధరకన్య యవంధ్యప్రతిజ్ఞ యై తప స్సమాధి [1]నియతత్వంబు వహియింప నిజాభిప్రాయంబు మేనకాదేవి కెఱింగించిన. 4

ఆ. గ్రుచ్చి కౌఁగిలించుకొని యమ్మహీధర
సార్వభౌముదేవి చతురభంగి

---

1. వశంబున సుధాకర కళాధరు వరించునదియై మేనకాదేవికి నిజాభిప్రాయం బెఱింగించిన.

బుజ్జగించి కూర్మి పొంపిరివోవంగ
హితమితోక్తిఁ బుత్త్రి కిట్టు లనియె. 5

ఉ. ఎక్కడ లేఁతవేల్పులు సమీప్సితదాతలు ముద్దుఁగూన! నీ
వెక్కడ? ఘోరవీరతప మెక్కడ? యీపటుసాహసిక్యముల్
తక్కు శిరీషపుష్ప మవధానపరత్వమునన్ మధువ్రతం
బెక్కిన నోర్చునో విహగ మెక్కిన నోర్చునో నిశ్చయింపుమా.

తే. అని నివారించె గిరిపత్ని యనుఁగుఁగూఁతుఁ
బార్వతియుఁ దల్లిమాటఁ జేపట్టదయ్యె
నీప్సితార్థంబునకుఁ [1]బాలుహృదయరుచియు
నిమ్నమున కోడిగిలునీరు నిలుపరాదు." 7

వ. అంత నాచంద్రానన సఖీముఖంబున నిజమనోరథంబు దండ్రి కెఱింగించి యమ్మహానుభావుచేత నరణ్యనివాసమునకును ఫలోదయాంతం బైన తపస్సమాధికిని నానతి వడసి దృఢప్రతిజ్ఞానిర్వాహంబున. 8

ఉ. భూధరరాజకన్య మణిభూషణముల్ దిగఁద్రావి యీశ్వరా
రాధనకేళికౌతుకపరాయణ యై ధరియించెఁ బాంసుర
శ్రీధృతిపూర్వకంబుగఁ బ్రగాఢపయోధరమండలీసము
త్సేదవిశీర్ణసంహతుల నేలుమహీరుహవల్కలంబులన్. 9

తే. చంచరీకాంగనాగరుచ్ఛాయ నేలు
కుటిలకోమలతరదీర్ఘకుంతలములు

1. జాలు.

మడమ లంటఁగ నిడు[1]పాఁపజడలు
[2]గట్టి, పాశుపతదివ్యదీక్షఁ జేపట్టె గౌరి. 10

సీ. ముత్యాలమొలనూలు మునువుసూపెడునట్టి
జఘనంబుపై మౌంజి [3]సవదరించెఁ
గందుక క్రీడపై గారాబు పచరించు
హస్తాబ్జములఁ బూనె నక్షమాల
కస్తూరికాంగరాగములతో విలసిల్లు
తనువల్లి హత్తించె ధవళభూతి
బొమ్మపెండిలిపాటఁ బ్రొద్దుపుచ్చునెలుంగు
నీలకంఠస్తోత్రనియతిఁ గూర్చెఁ

తే. బసిఁడికమ్ములయంచంపుఁబట్టుచేల
కొంగుచాటున వర్ధిల్లుకుచభరమున
గంతఁగా వైచెఁ బులితోలుకవసంబుఁ
బరమకల్యాణి గిరిసార్వభౌమతనయ. 11

తే. హంసతూలికపాన్పుపై నలరుమొగ్గ
[4]యొత్తునను మేను గల్గునీలోత్పలాక్షి
బాహువల్లి తలాడఁగాఁ బవ్వళించె
శైలపాషాణపట్టికాస్థండిలమున. 12

తే. పాశుపతదివ్యదీక్షావిభాసమాన
దివ్యతేజోవిశేషసందీప్తమూర్తి
కాలతాంగికి శతవృద్ధులైన మునులు
ప్రణతు లగుదురు భావిప్రభావశక్తి. 13

1. వాలు. 2. గట్టె, బాశుపతదివ్యదీక్షఁ జేపట్ట గౌరి. 3. సవధరించె. 4. యొత్తినప్పుడు జడియు.

వ. ఇవ్విధంబున నబ్జింబాధర ధరశిఖరంబులయందలి హరిణకిశోరంబులకు నరణ్యబీజాంజలివిధానంబునుం దరులతాకుంజంబులకు నిర్ఝరధారాసేకంబును నొనర్చుచుఁ గృష్ణాజినోత్తరాసంగవతియు సర్వాంగభసితాభ్యంగమంగళస్నానయు నై కొంతకాలంబు గడపి కాంక్షితంబు కడఁగానక తెంపు నేసి మండువేసవిం గనగనమండు నగ్నిముఖంబునడుమన నిలిచి కాలంబున నర్కమండలం బాలోకించియు వర్షాకాలంబునఁ మధ్యాహ్నబద్ధ పాళీక్షణస్థితంబులును దాడితాధరంబులును బయోధరోత్సేధనిపాత చూర్ణితంబులును త్రివళిక్షణస్ఖలితంబులును నాభిగహ్వరప్రవిష్టంబులు నగుజలధరజలబిందుధారలం దోఁగియు శిశిరకాలంబునం దివతాళించు కొలంకులలోనం బుక్కిటిబంటినీట నిశాసమయంబుల నిలిచియు నంబుచుళీ(భు)కంబులును నుడుపతికరంబులును సురకరువలిం డుల్లిన జీర్ణతరుపర్ణంబులును నాహారంబుగా దుష్కరం బైన తపంబు నేయుచుండ నొక్కనాఁడు. 14

మ. అజినాషాఢధరుండు ప్రౌఢతరభాషాతిప్రగల్భుండు నీ
రజబంధుప్రతిమానతేజుఁడు జటారాజిచ్ఛటాతామ్రమూ
ర్ధజుఁ డేకాకివటుండు బ్రాహ్మణుఁడు విశ్రామార్థముంబోలె నా
త్రిజగన్మోహనమూర్తిసన్నిధికి నేతెంచెన్ వనాంతంబునన్. 15

తే. ఇవ్విధంబున నేతెంచి యెదుట నిలిచి
గౌరి నాశీర్వదించె నక్కపటవటుఁడు
కలితకోమలనవకుశగ్రంథి యైన
యంగుళీపల్లవంబుల హస్త మెత్తి. 16

వ. పార్వతియు బహుమానపురస్సరంబుగా నయ్యుర్వీసురవటు
నకు నతిథిపూజ యొనర్చిన నతండును గొండరాచూలి సేయు
సత్కారం బంగీకరించి ముహూర్తమాత్రంబు విశ్రమించి
మెయివడిచూపునం జూచి ప్రస్తావనోచితంబుగా నిట్లనియె.

సీ. సలిలంబు త్రిషవణస్నానక్షమం బౌనె
యంభోజపత్త్రదీర్ఘాయతాక్షి!
కుసుమంబులును నిధ్మకుశపల్లవంబులు
సులభంబులై యున్నె సుందరాంగి!
సత్త్వంబు లన్యోన్యజాతివైరముఁ దక్కి
శాంతి గైకొని యున్నె చంద్రవదన!
యనుదినంబును దేహయాత్ర కాయిత మౌనె
నీవారపాకాది పూవుఁబోణి!

తే. శక్తికొలఁదిఁ దపశ్చర్య సంఘటింతె
ఫలముపై నాస నాగ్రహబంధ ముడిగి
తామ్రబింబోష్ఠి ధర్మసాధనములందు
నాద్య మగుసాధనంబు దేహంబ కాదె. 18

క. మగువా! నీపెంచినలత
చిగురున ముకుళంబు నుల్లసిల్లెనె చెపుమా!
పగడపుఁగెమ్మోవిపయి
న్నగ వుదయించినవిధంబునం బ్రస్ఫుట మై. 19

క. పంకజలోచన! కరద
ర్భాంకురములు మేసినట్టి యుపశాబమునకా
రంకుము దపోతకంబుల
జంకింపవుగా తపఃప్రశాంతి వెలితిగాన్. 20

తే. అభ్రవీథీపరిచ్యుతం బైనయట్టి
యమరతటినీ జలప్రవాహమ్ముకంటె
ధరణిధరరాజు నీచరిత్రంబుకతనఁ
బరమపావనుఁ డయ్యె నోపద్మనయన! 21

వ. సంబంధంబు సాప్తపదీనంబు గావున నింతతడవు నీతోడఁ గదిసి పలుకు చనికిం జేసి యే నాప్తుండఁ గావున నొక్క మాట యడిగెద. బ్రాహ్మణజాతిస్వభావసులభం బైన చాపలంబుఁ జూచి హెచ్చు గుండాడం బనిలేదు. రహస్యంబుగా నుండె నేనిం జెప్పుము. 22

సీ. ప్రథమప్రజానాథపావనకులమునఁ
బ్రభవించి తబల! ప్రపంచసార
సౌందర్యసంపద సడిసన్న దానవు
నశ్వరం బైశ్వర్యనైపుణంబు
సౌఖ్యంబు నిరవధి సర్వసామగ్రి నీ
యఱచేతిభాగ్య మత్యాయతంబు
భాగ్యంబు నీ కేమి భ్రాంతి యైనది మనో
రథ మేమి చెప్పుమా రాజవదన!

తే. దుష్కరం బైనతప మిట్లు తొడరి చేసి
మేను డయ్యించుకొనఁగ నేమిటికి వచ్చెఁ
జిత్తము విచారమార్గంబుఁ జేరఁదెచ్చి
తత్త్వముఁదెలియఁజెప్పు మాతముమ్మృగాక్షి! 23

వ. పితృగేహంబున నవమానంబు పుట్టదు గదా! పన్నగఫణారత్నంబుమీఁదఁ జెయిసాఁచువాఁడు గలండే! నిండుజవ్వనంబునకుం దగిన విభూషణంబులు తొలంగం బెట్టి వార్ధకోచి

సాసూపలద్రోణిఝులఝులత్కారంబు
దిఙ్మండలంబుల దీటుకొనియె
శిఖరకోటీశిలాశ్రేణిరారావుల
గ్రహతారకములు చూర్ణంబు లయ్యెఁ
తే. ప్రబలబలగర్వదుర్వారబాహుసుపర్వ
పూర్వగీర్వాణభుజదండభూరిసార
నితతమందరమంథానవివలనముల
సలిలనిధి మూరె నంరంభసంభ్రమమున. 61
వ. ఇట్లు తరువందరువ సముద్రమధ్యంబున. 62
ఉ. బుగబుగమంచు గర్భజలపూరము ఘూర్ణిల బంతిగట్టి క్రొం
బొగలు తరంగసంఘములఁ బొడ్మఁగ నూష్మ జగత్త్రయంబు
నుం, బొగులంగఁ జేయ నుద్ధవిడిఁ బుట్టెను నల్లనిచిచ్చు మా
విలేఁ, జిగురులచాయలం దెగడుజిహ్వలు గ్రోయుచు పర్వి
రేకు మై. 63
క. వాసుకివిష[1]ధరవిషని
శ్వాసంబుల ఘట్టనముల సుమధికతరమై
యీసాగరమధ్యంబున
భాసురహాలాహలంబు ప్రబలం బయ్యెన్. 64
చ. గరళ [2]మహావిషానలశిఖానివహంబును దాటి పాఱినం
దరికొనియెం జగత్త్రయము తల్లడ మందిరి సెమ్మనంబులన్
సురగరుడోరగామరులు స్రుక్కెఁ బితామహుఁ డంబు
జాక్షుఁ డా,తురత వహించె దిక్పతులు తూలిరి ఘూర్ణిలె
నేడు వార్ధులున్. 65

1. భ. 2. మహత్తరానల.

వ. అప్పుడు సుస్థిరుం డై విరూపాక్షుండు త్రైలోక్యరక్షాదక్షం
బగు తనదక్షిణహస్తం బెత్తి యోడకుండుఁ డభయం బిచ్చితి
నని యెంత యూఱడించిన నూఱడిలక నారాయణాదులు
గన న్వేల్పులు పలాయమానపరాయణు లై వెనుక మర
లియుం జూడక పోవం దొడంగిన. 66

శా. హుంకారం బొనరించి యప్రతిమరౌద్రోద్రేకసంరంభని
శ్శంకాహంకృతిఁ జూచె నీశ్వరుఁడు హస్తంబుల్ భుజంగాధిపా
లంకారంబు నశేషలోక పరిషల్లావణ్యలక్ష్మీకలా
సంకోచావహదాహభీషణవిషజ్వాలాజిఘృక్షార్థ మై. 67

క. స్తంభించి నిలిచె గరళము
శంభునిముందట యుగాంతజలధరముగతిన్
గంభీరహుంక్రియావ
ష్టంభసముజ్జృంభమాణసంరంభమునన్. 68

చ. జలధర మంతయై కరటిచందము గైకొని సూకరాకృతి
న్నిలిచి పికంబుతో దొరసి నేరెడుపండును బోలె నుండ యై
కలశపయోధిమంథనముఖంబునఁ బుట్టినయమ్మహాహాలా
హలము క్రమంబున న్శివునిహస్తసరోరుహ మెక్కెఁ జుక్కగన్.

క. కటుక మగువిషము విషధర
కటకం బగు కేలఁ బూని కౌతూహలియై
ఘుటికాసంసిద్ధుఁడు రస
ఘుటికయునుంబోలె మృడుఁడు గుటుకున మ్రింగెన్. 70

తే. కంఠికానీలరత్నంబుకరణి నొప్పె
లలితమృగనాభిపంకంబుచెలువు దాల్చెఁ

గాలకూటవిషంబు తత్కంఠమునకు
నాభరణ మయ్యె బ్రహ్మాదు లభినుతింప. 71

వ. అప్పు డప్పరమేశ్వరు నిట్లని స్తుతియించిరి. 72

సీ. జయ విరూపాక్ష! యీశ్వర! దివ్యలోచన!
జయ వజ్రహస్త! దిశానివాస!
జయ పినాకేష్వాస! శాశ్వత! నిత్య! య
నిత్య! నిత్యానిత్య! నిరుపమాన!
జయ చింత్య! జయరుద్ర! జయమహాదేవ! య
చింత్య! చింత్యాచింత్య! చిత్స్వరూప
జయ పాదభక్తార్తిసంహారకారణ!
జయ ముకుందప్రియ! జయ గిరీశ!

తే. దివసమాసార్ధమాసపర్వేశ్వరూప!
కల్పయుగ వత్సరాధీనకాలఖేచ
రుండ! బహురూప! చండీశ! దండపాణి!
జయ నమస్తే నమస్తే ప్రసన్నమూర్తి! 73

వ. అని యనేక ప్రకారంబులం బ్రస్తుతించి నీలకంఠుం డను
నామధేయంబు శివుని కిచ్చి రిది కాలకూటోత్పత్తిప్రకారంబు.

ఉ. హాలహలాగ్నిదాహభయ మస్తమితం బయినం గడంకమై
వేలుపులు న్నిశాచరులు వెండియుఁ గవ్వపుఁగొండ వార్ధిలోఁ
దేలిచి గుమ్ముగుమ్మనఁగఁ ద్రిప్పఁగఁ జొచ్చిరి [1]దారహీశ్వరుల్
వాలిసహాయుఁ గాఁ గొని యవక్రభుజాబలవిక్రమంబునన్.

క. తరిగొండఁ దరువఁ దరువఁగ
శరనిధిమధ్యమున నొక్కజలజము పుట్టెన్

1. దానవేశ్వరుల్.

బరిమళపరంపరలచే
సురభీకృత మయ్యె జగము సుమచిరభంగిన్. 76

వ. అయ్యష్టదళపద్మమునందు. 77

సీ. ఇరుప్రక్కియలనుండి సురసింధురంబులు
పరిపూర్ణ హేమకుంభములు వాల్ప
చెంచెంద నవనిధానాధిదేవతలును
సొరిది బంగారువీచోపు లిడఁగ
జయజయధ్వనులతో సర్వదేవతలును
గేలుదమ్ములు మోడ్చి గీలుకొల్పఁ
బుష్పవర్షములకుఁ బ్రోదియై వినువీధి
దేవదుందుభినాద మావహిల్లఁ

తే. బ్రబలి మున్నీటినడుమనీటఁ బొడమునికచ
కమలకాంచనకర్ణికాగ్రంబునందు
బ్రహ్మాదిక్పాలవందితపాదపద్మ
పద్మ యుదయించెఁ గన్నులపండు వగుచు. 78

తే. పవడములఁ బోలు శ్రీహస్తపల్లవములు
వనర శోభిల్లు హేమపద్మము ధరించి
కలిమిచూపులపూఁబోడి కలశజలధి
నర్థిఁ గొలు వుండె రత్నసింహాసనమున. 79

క. జలరుహవాసిని పుట్టిన
కలితముహూర్తమున రెండుగడియలమాత్రం
జలిగురికాఁడై నిగనిగ
కలువలచెలికాఁడు పుట్టెఁ గలశపయోధిన్. 80

వ. తదనంతరంబ. 81

క. అందంద యుద్భవించెను
సుందరమున నిందిరానుసంజాతములై
మందారకల్పతరుహరి
చందనసంతానపారిజాతాదు లొగిన్. 82

ఉ. అంతఁ బయోనిధానమునయం దుదయించె సరోజవాసినీ
కాంతకుఁ దోడఁబుట్టు వనఁగాఁ గరపద్మమునం జలూకికా
సంతతియుక్త హారీతకియు సాధనసంగ్రహ మై తలిర్పఁ ధ
న్వంతరి యెట్టిరోగములవారి కనామయసౌఖ్యకారి యై. 83

తే. ఆదివైద్యుఁ డతండు దుగ్ధాబ్ధిఁ బుట్టె
నమృతపూర్ణకుంభం బొకహస్తమునను
నంబుచరమును గరకకాయయును నొకటఁ
దాల్చి సాకార మైనకాంతము యనంగ. 84

వ. మఱియును. 85

క. అచ్చపువెన్నెలచాయల
మెచ్చునితనుదీప్తితోడ మేఘధ్వనిపెం
పచ్చుపడఁగ సకిలించుచు
నుచ్చైశ్శ్రవ ముదధినడుమ నుదయంబయ్యెన్. 86

తే. క్షీరవారాశిలో నవతారమయ్యెఁ
దార యనుకన్యకయు నతిధవళనయన
తారకారాజబింబావదాతవదన
తారహారాదిభూషణోత్కరముతోడ. 87

శా. అయ్యంభోనిధివారిగర్భమునయం దైరావణం బుద్భవం
బయ్యెంగండతలంబునన్ దొరఁగుదానాంభఃప్రవాహంబు లెం

దోయ్యెయ్యిర్ ప్రభవించి తజ్జలధినీ రుబ్బింప దిక్కుంభుల
న్వియ్యం బందఁ గఠోరగర్జితమహానిర్ఘాతనిర్ఘోషముల్. 88
సీ. మధుకరంబులు పుట్టె మధుకరంబులు గావు
రమణీయవేణీభరములు గాని
శశిబింబములు పుట్టె శశిబింబములు గావు
మహితవక్త్రేందుబింబములు గాని
మెఱుఁగుఁదీఁగెలు పుట్టె మెఱుఁగుఁదీఁగెలు గావు
లలితకోమలతనూలతలు గాని
చక్రవాకులు పుట్టెఁ జక్రవాకులు గావు
కఠినంబు లగుచన్నుఁగవలు గాని
తే. యనఁగ మందరకందరవ్యాప్తిచలిత
వార్ధికల్లోలవీచికావర్తతతుల
నుద్భవిల్లిరి రంభాతిలోత్తమాదు
లప్సరస్త్రీలు దేవవేశ్యాజనములు. 89
క. తరిగొండఁ దరువఁ దరువం
దిరుగుడువడునుదధిలోనఁ దీవ్రముగా ది
ద్దిరఁ దిరుగుచుఁ దరఁగలవడి
దరతరమ సుపర్వసురభి దరికిం జేరెన్. 90
ఉ. అంత న్విద్రుమవల్లరీకిసలయవ్యాప్త్యేకశంకావహా
త్యంతస్వచ్ఛరుచిచ్ఛటల్ జలధిపై నందంద నర్తింపఁగా
స్వాంతాశాంతరభూమిభాగమున విశ్వంబుం బ్రకాశింపఁగాఁ
జింతారత్నశలాక పుట్టెను మహాక్షీరాబ్ధిమధ్యంబునన్. 91
తే. తరువఁ దరువంగ వార్ధిమధ్యంబునందు
నాగవల్లీలతాప్రతానంబు పుట్టె

నమృతసంసర్గమునఁ గడా యాఱునెలలు
జరగు నేయాకునకు లేనిసరసవృత్తి. 92

క. శీతలపరిమళధారా
పాతపవిత్రాయమానపవమానం బై
యాతోయధిమధ్యంబున
శ్రీతులసీవనము పుట్టె శ్రీయంశమునన్. 93

తే. కలిగె దివ్యౌషధీలతావలులశక్తిఁ
బాలమున్నీటిసీటిలోఁ బ్రథితలీల
విమల [1]గరుడాండమాణిక్యవిభ్రమంబు
లభినవంబులు హరితదూర్వాంకురములు. 94

వ. ఇట్లు మహార్ణవజాతంబు లగుపదార్థంబులం గనుంగొని, బ్రహ్మాదిదేవతలు హరునకు శశాంకుని హరికి లక్ష్మి నింద్రునకు నైరావణోచ్చైశ్శ్రవంబులను నిచ్చిరి. అప్సరసల నాకంబున నుండ నియమించిరి. కామధేనువును వరుణున కొప్పనంబు సేసిరి. కల్పతరుచింతామణుల నందనోద్యానంబునం బ్రతిష్ఠించిరి. దూర్వాంకురంబులు హేరంబున కవతంసంబుగా నొసంగిరి. నాగవల్లీదళంబులు భోగార్థంబుగా భూజనంబుల కిడిరి. శ్రీతులసీకావనంబులును సకలతీర్థంబులకు సమాశ్రయంబుఁ గావించిరి; యనంతరంబ మందరంబును, యథాస్థానంబునం బెట్టి వాసుకిం బాతాళంబున కనిచి కమఠపతిం గుస్తరించి నివాసంబులకుం బోవ నుద్యోగించి యున్నంత. 95

ఉ. అంధకకాలకేయమహిషాదులు దైత్యులు బాహుశైలద
ర్పాంధులు గూడి యొక్కమొగమై వడిఁ దొమ్మి యొనర్చి,

1. గారుడ.

వైదుష్య నిర్బంధము సేసి కైకొనిరి గ్రక్కునఁ దన్మహనీయ
దక్షిణ, స్కంధముమీఁద నున్న మణికమ్రసుధారసహేమ
కుంభమున్. 96

తే. అమృతకుంభంబుఁ గైకొనియసురవరులు
వేఱ యొకచోట వేలంబు విడిసియుండి
రమణులకు నీక యప్పదార్థముఁ గడంగి
తార విభజించి భుజియించువారుఁబోలె. 97

వ. అవ్విధం బెఱింగి హరవిరించులు విష్ణు రావించి గోత్రకల
హంబు మాన్ప నిఖిల మాయోపాయవిద్యావిదుండ వగు
నీవ యెఱుంగుదు మాకు నిం కిక్కడ నుండం బని లేదు
పోయి వచ్చెద మని యామంత్రణంబు సేసి నిజస్థానంబుల
కరిగిన యనంతరంబ. 98

తే. కైటభారాతి యక్కార్యగతికిఁ దగిన
యనువు చింతించి యసురుల నవమతింప
సురల కమృతంబు నొప్పింప నెరవు దెలిసి
యరిగె నంతర్హితుం డయి యద్భుతముగ. 99

వ. ఇవ్విధంబున హరి యంతర్ధానంబు చేసిన ముహూర్త
మాత్రంబున. 100

శా. ఆకాశంబుననుండి డిగ్గె నొకనీలాంభోజపత్త్రాక్షి ది
వ్యాకారంబును దివ్యమాల్యములు దివ్యాలంకృతు ల్దివ్యవ
స్త్రాకల్పంబులు దివ్యగంధములు నాహా పుట్టఁ జేయంగ నా
కౌకశ్శ్రేణికి దైత్యపఙ్క్తికిని విద్యుల్లేఖచందంబునన్. 101

క. బృందారకపథమున డిగి
యిందీవరపత్త్రనేత్ర యిపవంకలవా

సం దమక తమక యిటు గా
యుం దనఁగా రెండువీళ్ల నెడమున విడిసెన్. 102

వ. నిలిచి హావభావవిలాసంబులన దేవాసురులం భ్రమయింపం
జేయుచు స్కంధావార మధ్యంబున. 103

సీ. పాకశాసనునకుఁ బరిహాసవచనంబుఁ
  గాలకేయునకు శృంగారలీల
వైవస్వతునకు భ్రూవిల్లరీనటనంబు
  కరటిదానవునకుఁ గలికిచూపు
పాశపాణికిఁ గుచప్రాంతోపదర్శనం
  బంధకాసురునకు నలఁతనగవు
ధననాయకునకు నుత్కంఠావిశేషంబు
  మహిషునకును నర్మమర్మకలన

తే. గంధవహునకు సిగ్గు జలంధరునకుఁ
గలికితనము పావకునకుఁ గౌను బలికి
వలపు నటియించుచును వారవార తనకుఁ
దాన వారికి వారికి నైనయట్లు. 104

తే. అందఱను భ్రమపెట్టుచు నవ్వధూటి
యెవ్వరికిఁ దాను బ్రమయక యెడన యుండె
దానిపై వాలి చొక్కె నందఱమనములు
గంధఫలిమీఁద వాలుభృంగములపగిది. 105

తే. అసురులకు దేవతలకు నయ్యవసరమునఁ
బొలువోకుండె నప్పు డప్పద్మనయన
యుభయవాదులు గూడి యయ్యుత్పలాక్షి
పాదపంకజములకును బట్టులైరి. 106

వ. మఱియు విష్ణుమాయావిశేషంబున. 107

క. ఇది చెప్పినట్లు చేయుదు
మిది పంచినయట్లు నడతు మిది కళ్యాణా
భ్యుదయనిధానము మా కని
హృదయంబులఁ దలఁచుచుండి రిరుదెసవారల్. 108

తే. కనకసింహాసనము వెట్టి కాళ్లు గడిగి
పాదతీర్థంబు లొగిఁ ద్రావి ప్రణతిసేసి
కొలిచి కూర్చుండి రిరువంకకొలమువారు
భువనమోహిని యైనయప్పువ్వుఁబోఁడి. 109

క. ఎవ్వనివంకఁ గనుంగొను
నవ్వనితామణివిలోచనాంచలమున వాఁ
డవ్వేళన కీలించు
న్నవ్యం బగుకేలుదోయి మకుటాగ్రమునన్. 110

వ. వైరానుబంధంబు లుడిగి యిఱ్ఱువాఁగువారుం దమలోన
నిట్లనిరి. 111

క. మన మొండొరు నమ్మక యెడ
[1]నునుచు సుధారసము నింతయును దగ నింకే
మని యెంచుగాఁ దలఁప కీ
వనితామణి పంచిపెట్టవలయుం జుండీ. 112

వ. అని యమృతకలశంబుఁ దెచ్చి యప్పయోజాక్షి చేతి కిచ్చి, ధర్మంబు పుణ్యంబు పాపంబు నీయది యిరుదెఱంగులవారు నీకు నొక్కరూప యిప్పదార్థంబు మాకుం బంచిపెట్టుము.

తే. తప్పకుండఁగఁ బక్షపాతంబు లేక
పంచిపెట్టుమువా రబ్బ రంచుఁగాక

---

1. నునిచిన యీ యమృత మిం.

యన్నదమ్ములమై యుండి యకట [1]మేము
నిన్ను వడ్డించు టందమె యన్నుమిన్న. 114

తే. అనిన నే నేర్తు నయ్య మీరాయంతవారు
కోరి కూర్చుండ నమృతంబుఁ గుడువఁబెట్టఁ
బంచి వడ్డింపనేర్చు టల్పంపుఁబనియె
తొల్లి యొకనాఁ డెఱింగినత్రోవ గాదు. 115

వ. అయిన మీవచనంబులు చెఱుపంజాల నానేర్చిన విధంబున సుధారసంబు వడ్డించెద మీరందఱుఁ గృతస్నాను లై పయోధిపులినవేదికాస్థలంబున నిరుదెఱంగులవారు రెండు బంతులుగాఁ గూర్చుండుఁ డని నియోగించిన. 116

ఆ. వార లట్లచేసి వరుసగాఁ గూర్చుండి
పసిఁడిపళ్లెరములు పన్నికొనఁగ
నల్ల నల్ల వచ్చె నలసయానంబున
నమృతకుంభహస్త యగుచుఁ దరుణి. 117

మ. అరవిందాసన పట్టుఁబుట్టము చెఱంగాందోళనం బొంద ని
ష్ఠురపీనస్తనభార మల్లఁ గదలన్ రత్నాలతాటంకముల్
మొరయ న్నూపురమేఖలావలయముల్ మ్రోయంగ పాత్రం
బుల, న్సురధేన్వాజ్యము ప్రస్తరింపఁ దొడఁగె న్దూర్వాంకు
రాగ్రంబునన్. 118

ఉ. స్నానపవిత్రగాత్రులును చందనచర్చితబాహుమధ్యముల్
[2]మౌనసమాధినిష్ఠులును మత్సరచిత్తులు నై మహాసమా

1. మేము, మిమ్ము మము మీరు వంచింపమేలె చెపుడ. కొన్నిప్రతులలో నీ 114 పద్యము 113 వచనమునకుఁ బూర్వ మున్నది. 2. మాన.

హర—12

ధానముతోడ నుత్తరము దక్షిణము న్సముపాశ్రయించి య
ద్దానవులు న్సుపర్వులును దన్నుఁ బ్రియంబుగఁ జూచు చుం
డఁగన్. 119

ఆ. హోమపూర్ణకుంభ మెత్తి వడ్డింపంగఁ
గడఁగెఁ గాంచనంపుగరిటె ముంచి
శాంతిమంత్రఘోషసంస్కారపరిపూత
వదను లైనయుభయవంశ్యులకును. 120

క. పోయును నిజాలయమ్మృతము
తోయజదళనేత్ర సురలతోయంబునకుఁ
మాయామృతపూరము దై
తేయులకుం బోయు నత్యధికధీప్రౌఢిన్. 121

తే. మధురగోక్షీరధారాసమాన మైన
మంచియమృతంబు వెట్టె వైమానికులకు
మగువ మృగతృష్ణికాంభస్సమాన మైన
కల్ల యమృతంబు వడ్డించెఁ గర్బురులకు. 122

వ. ఇవ్విధంబున నప్పరమాణుమధ్యతథ్యమిథ్యామృతాహారంబు
లాసురాసురులకు వెట్టి కామదుగ్ధేనుఘృతధారాభిఘారంబు
గావించి పంక్తిమధ్యంబున నిలిచి కంకణఝుణఝుణత్కారంబు
తోరంబుగా నాపోశనంబు వోసి యారగింపుండు ప్రొద్దు
వోయె ననుచు నెలుంగెత్తి మత్తకోకిలకంఠకుహూపంచమ
స్వరంబునం బల్కిన. 123

తే. మొదలఁ దేనియలుట్టునంభోపహతి

పికప భుజియింపఁ దొడఁగిరి త్రిదశవరులు
దైత్యులునుదధ్యమిథ్యాసుధారసములు. 124

క. కిక్కురు మన కమృతంబుం
గ్రుక్కలు వెట్టుదురు సురలు కోణపముఖ్యుల్
తక్కిసుధారసంబులు
గ్రుక్కలు వెట్టుదురు వారిఁ గూడియె తారున్. 125

తే. గ్రుక్క గ్రుక్కకుఁ గడుఁ దేజ మెక్కుచుండె
నమరులకు గ్రుక్క గ్రుక్కకు నడఁగుచుండె
దైత్యులకుఁ దేజ మట్టివిధంబు గాక
రాహుకేతువు లనియెడు రాత్రిచరులు. 126

వ. తమయెదిరిపంక్తి నున్నచంద్రార్కులసంగడి స్త్రీఅంగి కూర్చుం
డిన నా గ్రహరాజు లిద్దఱుం దమలోన నిట్లని విచారించి.

ఉ. వంచన వేల్పుటెంకి కిటువచ్చి యుపాంతమునందు ముందటం
గంచముఁ బెట్టుకొన్నయవి కప్పురయుగ్మము మాఱువెట్ట నే
తెంచుచు నున్నవాఁడు మనదేవర విష్ణుఁడు వెంట వీరి సూ
చించుట మేల్సుధారసము చిప్పెఁడువోయకమున్న శౌరికిన్.

తే. అని విచారించి చెప్పనున్నంతలోనఁ
బోసె నిరుకంచములయందుఁ బుడిసెఁడంత
త్రావియును ద్రావకుండఁగ రాహుకేతు
లనుచుఁ జెప్పిరి మురవైరి కర్కవిధులు. 129

వ. అటు విన్నప్పుడ తత్సుధారసము కంఠాధఃప్రదేశంబు సో
చ్చుట లేకుండఁగ రాహుకేతువుల యక్షుద్రోత్తమాంగంబు
లొక్కట ఖండించెను మాయపుంబడఁతియాకారంబు వీ

డొక్కక యుత్కటకాలంకృతహస్తచక్రమున శ్రీకాంతుం
డవిభ్రాంతుఁడై. 130

క. రాహునకుఁ గేతునకు హరి
బాహాచక్రమున నదరు పాటిల్లుటయుఁ
హాహానినాదపటుకో
లాహలబహుళంబుగాఁ గలంగిరి దివిజుల్. 131

సీ. వేగ మాయావధూవేషంబు డిగఁద్రావి
కైకొనె నిజమూర్తి కైటభారి
హరి తమ్ము వంచించె సరివేళ గా దని
దైత్యులు చనిరి పాతాళమునకు
నమృతంబు భుజియించి యమృతకుంభముఁ గొంచు
జనిరి వేల్పులు నిజస్థానమునకు
బహువారములయందు బహువస్తువులు గాంచి
కలశపాథోరాశి కాను పుడిగె

తే. నుక్కెవడియున్కిమాని పెల్లుబ్బె నాక
మప్సరఃకామినీతురంగాదికముల
నచ్యుతుఁడు లచ్చి నటఁ బెండ్లియాడి యరిగె
నాగరిపు నెక్కి వైకుంఠనగరమునకు. 132

క. ఈవార్ధిమథనకథనం
బేవారు పఠించిరేని నెలమియు నాయు
శ్శ్రీవృద్ధులఁ గాంతురు వి
ద్యావత్తయు యశముఁ గల్గు నావారలకున్. 133

శా. శంకాతంకవిహీనవిక్రమకలాసాకల్య విజ్ఞాన! సా
హంకారోదువివేకవిక్రమ! సురాహారాహితస్పర్ధిని

స్పంకాళోజ్జ్వలకీర్తివిభ్రమ! మహీసంకల్పకల్పద్రుమా!
లంకాశంకరశైలమధ్యవసుధాలంకార భవ్యక్రమా! 134

క. శరణాగతధీపంజర!
నరకుంజర! దానకర్ణ! నందితవిద్వ
ద్వరవర్ణ! విమలచరిత
స్ఫురితా! యనవరత శంభుపూజానిరతా! 135

ఉపేంద్రవజ్రము. కులప్రదీపా! యలఘుప్రతాపా!
విలాసశక్రా! జితవీరచక్రా!
కలాజయంతా! ఘనకాంతికాంతా!
నిలీనశంకా! నిజనిష్కళంకా! 136

గద్యము. ఇది శ్రీమత్కమలనాభపౌత్ర మారయామాత్య
పుత్ర వినయవిధేయ శ్రీనాథనామధేయప్రణీతం బయిన
హరవిలాసం బను మహాప్రబంధంబునందు షష్ఠాశ్వాసము.

శ్రీ ర స్తు

# హ ర వి లా స ము.

---



## స ప్తమాశ్వాసము.

కాళహస్తినాథ
ప్రాకారాంతఃప్రణీతపాతాళగుహా!
శ్రీకాళహస్తిభక్తసు
ఖీకల్పితవిభవ! యవచిదేవయతిప్రా ! 1

వ. ఆకర్ణింపుము. 2

ఉ. అర్జునుఁ డింద్రకీలగిరియందు రసాలతమాలతాలనీ
పార్జునలోధ్రతింపుకనవామలకీపనసామ్రపాటలీ
సర్జకురంట[1]కాఘ్నహారిచందనచందననింబకేతకీ
భూర్జకపిత్థ[2]పూగముఖభూరుహపుణ్యతమాశ్రమంబున్. 3

క. దుర్యాతపరాభవమున నగు
చేతోదుఃఖమునఁ దపము చేయఁగఁ దొడఁగెన్
ఖ్యాతలయనుమతి శత్రు
వ్రాతజయార్థంబు మది దివస్పతి గురిగాన్. 4

మ. ధనురస్త్రంబులు కేలఁ దాల్చి శరధిద్వంద్వంబు నేపార వీఁ
పున బంధించి కిరీటి యై కవచి యై పూనెం దపశ్చర్య య

---

1. కాదిగురు. 2. పూర్ణ.

ర్జునుఁ డత్యంతగరిష్ఠనిష్ఠ నమరేంద్రుం గూర్చి యయ్యింద్రకీ
లనగాగ్రంబునఁ బ్రత్యనీకవిజయశ్లాఘాభిలాషంబునన్. 5

క. వంచన మనంబులోన నొ
కించుకయును లేక యమ్మహేంద్రముమీఁదన్
బంచానల మధ్యంబునఁ
బాంచాలీవల్లభుఁడు తపం బొనరించెన్. 6

తే. గాండివముతోడ నొకయోగదండయష్టి
యస్త్రములతోడఁ గొన్ని దర్భాంకురములు
[1]కత్తళముతోడఁ బుండరీకంబుతోలు
దాల్చి క్రీడి విరుద్ధపువేషము చేసె. 7

శా. శాకాహారుఁడు నిర్జితేంద్రియుఁడు పాషాణాగ్రతల్పుండునై
నాకేశప్రియనందనుండు సలిపె న్నానాప్రకారంబులన్
వాక్కుం జిత్తము దేహము న్సరియొకా నానాతపశ్చర్యలన్
వ్యాకీర్ణోరగసింహభల్లుకలులాయాభీలశైలాటవిన్. 8

సీ. పతయాళునిర్ఝరాంభఃప్రవాహంబుల
నఘమర్షణస్నాన మాచరించుఁ
గొండగోఁగుంబూలఁ గుండవర్ధనముల
నర్చించు శశిలాంఛనార్ధమౌళి
స్ఫటికాక్షమాలికాపాణిప్రవాళుఁడై
జంభారిమంత్రంబు జపముచేయు
నొంటికాల బుజంబు నూర్ధ్వంబుగాఁ జాఁచి
తడవుగా నిలుచుండి తప మొనర్చు

1. కలపముల.

తే. శరభశార్దూలసింహాదిసత్త్వచయము
కెరలి తనమీఁద బిట్టు లంఘించునపుడు
కడిమిఁ జెండాడు భుజదండ గాండివోగ్ర
చండతరశాతనిర్ఘాతకాండవితతి. 9

తే. వీరరసగర్భితం బయ్యు విస్తరిల్లె
శాంతరస మెంతయును సవ్యసాచియందు
మలయశైలనితంబమండలమునందు
సర్పవేష్టితచందనక్ష్మాజమట్లు. 10

వ. ఇవ్విధంబునఁ గపికేతనుండు గాండివజ్యాఘాతరేఖాకిణకళంకాలంకారంబు లగుకరంబులు నీవారపాకంబునకును బాంచాలకన్యాకాకుచకుంభకుంకుమప్రేక్షణీయం బైనవక్షంబు రుద్రాక్షధారణంబునకును నంగారపర్ణగర్భనిర్భేదనచణ హుంకారకారణం బగు కంఠంబు మహేంద్రదేవతామంత్రాక్షరధారణంబునకును ఖాండవదహనవేళావిజృంభితావష్టంభసంరంభం బగు హృదయాంభోరుహంబు ప్రణవోపలంభమునకును గుంభసంభవప్రదిష్ట శాఖాశిఖర పక్షిలక్ష్యావలోకన జాగరూకంబగువీక్షణంబులు నాసికాప్రదేశానుసంధానంబునకును యంత్రమత్స్యవిభేదనోపాయసంపర్కన ప్రభావసంసిద్ధి యగు బుద్ధి వృద్ధోపసేవనమునకును గంగాజలనిగ్రహానుగ్రహాపాదనసమగ్రం బగు మానసోత్సాహం బింద్రియభంగంబునకును నుత్తరదిగ్విజయయాత్రాధురీణంబు లగు చరణంబులు తీర్థగమనంబులకును బాల్పడఁజేసి జగజెట్టిబిరుదంబు నెట్టుకొనం జేసి తంద్రిఁగుఱించి తపంబుఁజేయుచుండ దినంబులు గడచె వారంబు లరిగెఁ బక్షంబులు సనియె మాసంబులు

వోయె ఋతువు లతిక్రమించె సంవత్సరంబు దాఁటె నయ్య
వసరంబున. 11

సీ. తెల్లనిగడ్డంబు తెల్లనిమీసము
లన్నరసినరోమపాండురశిరంబు
మేధావిబొట్టును మెఱుఁగుజన్నిదములు
భూతిలలాటత్రిపుండ్రకంబుఁ
గావిదోవతియును [1]గంథోత్తరీయంబు
నిష్టికోలయుఁ జంక నిక్కితోలుఁ
బంచాంగముష్టియుఁ బాణిఁ బవిత్రంబు
[2]నొక్కవ్రేలికి వెండియుంగరంబు
తే. జాలుబోజయుఁ [3]గుశదబ్బసంబెలయును
[4]నెడమకేలను నిడుగోల గొడుగుఁ దాల్చి
వనకుసజ్ఞాతిగా నొక్కతపసి వృద్ధ
బ్రాహ్మణుఁడు వచ్చె నొయ్యొయ్యఁ బాధకడకు. 12

వ. వచ్చి యాశీర్వదించి మహాత్మా! నీసంగడంబునం దపంబు చేయవచ్చితి నిచ్చోఁ గొన్నిదినంబులు క్రూరజంతువులు నన్ను బాధింపకుండ నరసికొని యుండవలయు నని పల్కి యతనిముందటఁ బరిశ్రాంతుఁడుంబోలెఁ జతికిలంబడి కూర్చుండె. 13

తే. మోఱకునిచందమున నీఱతాఱుచూపు
పొండవేయునిపైఁ దార్చి బ్రాహ్మణుండు

1. కంఠోత్త. 2. నొక జుట్టవ్రేల వెండుంగరంబు. తి. పా. 3. నురు దబ్బ. 4. జెత్త గొడుగును జక్కఁ దాల్చి కుతుకమున.

పలికె నిష్ప్రచ్ఛరం బైనభాషణములఁ
బరమనాస్తికభావంబు పరిమళింప. 14

తే. అన్న! యెవ్వరివాఁడ వీయడవిలోనఁ
దపము సేసెదు నీమంత్రతంత్ర [1]విధులు
పాకశాసనదేవతాప్రార్థనాను
సూచకము లైనయవి యెన్ని చూడ నిపుడు. 15

ఉ. చక్కనివాఁడ వెంతయును జల్లనివాఁడవు భాగ్యరేఖఁ బెం
పెక్కినవాఁడ వీవిపిన మెక్కడ నీసుకుమారతాగుణం
బెక్కడ ఘోరవీరతప మీయెలప్రాయమునందుఁ జేయు నే
యక్కట యెవ్వఁ డైన నకృతాత్ముఁడ వీ వాకరుండు దక్కఁ
గన్. 16

క. శరచాపధారణంబుఁ
బరమమనశ్శాంతి దాంతి పరిపాకంబుఁ
బరికింపఁ "జంకదుడ్డును
శరణార్థియు" ననెడునట్టిచందము దోఁచెన్. 17

క. వైరిమదకుంభికుంభవి
దారణదారుణకృపాణధారలు పరిఘా
కారములు కంపమూలో
ద్ధారములకుఁ బోలుపడెఁ గదా నీకరముల్. 13

శా. ఈభద్రాకృతి యిమ్మహాభుజయుగం బీదీర్ఘకోదండ మీ
యాభీలత్వ మొకం డొకొండ భువనైకాధ్యక్షతాహేతు వే
లాభం బొత్తఁ దలంచి చేసె దొకొ గోలాంగూలభల్లూకమ
త్తేభాకీర్ణవనాంతరంబునఁ దపం బేకాగ్రభావంబునన్. 19

1. పదులు.

పలికె నిప్పచ్చరం బైనభాషణములఁ
బరమనాస్తికభావంబు పరిమళింప. 14

తే. అన్న ! యెవ్వరివాఁడ వీయడవిలోనఁ
దపము సేసెదు నీమంత్రతంత్ర [1]విధులు
పాకశాసనదేవతాప్రార్థనాను
సూచకము లైనయవి యెన్ని చూడ నిపుడు. 15

ఉ. చక్కనివాఁడ వెంతయును జల్లనివాఁడవు భాగ్యరేఖఁ బెం
పెక్కినవాఁడ వీవిపిన మెక్కడ నీసుకుమారతాగుణం
బెక్కడ ఘోరవీరతప మీయెలప్రాయమునందుఁ జేయునే
యక్కట యెవ్వఁ డైన నకృతాత్ముఁడ వీ వాకరుండు దక్కఁ
గన్. 16

క. శరచాపధారణంబుఁ
బరమమనశ్శాంతి దాంతి పరిపాకంబుఁ
బరికింపఁ "జంకదుడ్డును
శరణార్థియు" ననెడునట్టిచందము దోఁచెన్. 17

క. వైరిమదకుంభికుంభవి
దారణదారుణకృపాణధారలు పరిఘా
కారములు కంధమూలో
ద్ధారములకుఁ బాలుపడెఁ గదా నీకరముల్. 18

శా. ఈభద్రాకృతి యిమ్మహాభుజయుగం బీదీర్ఘకోదండ మీ
యాభీలత్వ మొకం డొకొండ భువనైకాధ్యక్షతా హేతు వే
లాభం బాత్మఁ దలంచి చేసె దొకో గోలాంగూలభల్లూకమ
త్తేభాకీర్ణవనాంతరంబునఁ దపం బేకాగ్రభావంబునన్. 19

1. పదులు.



తే. ఈశ్వరునిఁగూర్చి చేసెద వేని లెస్స
మాధవునిఁగూర్చి చేసిన మాకు హితవు
బ్రహ్మఁగూర్చి చేసిన నది పరమతరము
తగునె యిలవజ్రధరుఁగూర్చి తపము సేయ? 20

తే. ఎవ్వఁ డుపదేశ మొనరించె నింద్రుఁగూర్చి
తపము సేయుము నీ వంచు దయ దలిర్ప
నాతఁ డెఱుఁగఁడు గాక యాయద్రిభేది
గౌతమునియింటఁ జేసినకామగోష్ఠి. 21

సీ. ఆసహస్రాక్షునియాత్మ సంశుద్ధికిఁ
బరమసంయమియింటికంచ సాక్షి
[1]యానిర్జితేంద్రు బాహావిక్రమమునకు
భుజగాంతకునియాకపోక సాక్షి
యాసునాసీరు నహంకారగరిమకు
నిషధాచలముమీఁది నెలవు సాక్షి
యాశచీవల్లభు నౌచిత్యకలనకుఁ
దాపసుచేతిపూఁదండ సాక్షి.

తే. యిట్టిదేవేంద్రువలన నీ వేమి ఫలము
[2]వడసెదవు చాలు నీవాంఛ పాడుగాను
వాఁడు నీకంటె నేమిట వాసి గలఁడు
తగదు చాలింపు మీవిరుద్ధంపుఁదపము. 22

వ. అని యెంత చెప్పిన నత్యంతధీరోదాత్తుం డగుపాండుపుత్త్రుం
డూరక తపంబు చేయుచుండె నట్టి యేకాగ్రభావంబునకుం

1. యానిర్జరేంద్రు. 2. చేసి పడసెదవేమి వాంఛితఫలంబు.

బ్రియంబంది వృద్ధబ్రాహ్మణవేషంబు మాని వృద్ధశ్రవుండు
ప్రత్యక్షుం బై వరంబు వేఁడు మనుటయు. 23

క. గురుభీష్మకర్ణసైంధవ
గురుతనయులతోడఁ గూడఁ గురుపతిబలము
న్బరిమార్చునట్టిసత్త్వముఁ
బురహరుఁ తా యిమ్ము కరుణఁ బొంపిరి వోవన్. 24

వ. అనిన నింద్రుండు సవ్యసాచి కి ట్లనియె. 25

తే. భీష్మగురుకర్ణకృపు లనిర్భేద్యబలులు
ద్రోణిభూరిశ్రవోభగదత్తశల్య
సైంధవులు పేరుగలవారు సమరజయము
శంభుకృప లేక యెబ్భంగి సంభవించు. 26

వ. పశుపతిఁ గురించి తపంబు సేయుము తత్ప్రసాదంబున నీకుం
జయం బయ్యెడుఁ బునర్దర్శనంబు కాఁగలయది పోయి
వచ్చెద నని యింద్రుం డంతర్ధానంబు చేసె. 27

తే. తండ్రి చెప్పినమాటలు దప్ప కప్పు
డాదరించి ధనంజయుం డభవుఁ గూర్చి
యింద్రకీలాచలంబుపై నేకనిష్ఠ
ధీరుఁ డొనరించె నతిఘోరవీరతపము. 28

మ. భసితోద్ధూళితనిర్మలావయవుఁడు న్బంచాక్షరీసంతతా
భ్యసనవ్యాప్తిపరాయణుండును శివధ్యానానుసంధాతయున్
మసృణస్నిగ్ధతరక్షుచర్మమయకంథాభద్రపీఠుండు నై
[1]యసమస్థేముఁ గిరీటి పాశుపతదీక్షారంభముం గైకొనెన్. 29

---

1. తి. పా.

ప్రియంబంది వృద్ధబ్రాహ్మణవేషంబు మాని వృద్ధశ్రవుండు
ప్రత్యక్షుం డై వరంబు వేఁడు మనుటయు. 23

క. గురుభీష్మకర్ణసైంధవ
గురుతనయులతోడఁ గూడఁ గురుపతిబలము
న్బరిమార్చునట్టిసత్త్వముఁ
బురహరుఁడా యిమ్ము కరుణ బొంపిరి వోవన్. 24

వ. అనిన నింద్రుండు సవ్యసాచి కిట్లనియె. 25

తే. భీష్మగురుకర్ణకృపు లనిర్భేద్యబలులు
ద్రోణిభూరిశ్రవోభగదత్తశల్య
సైంధవులు పేరుగలవారు సమరజయము
శంభుకృప లేక యెబ్భంగి సంభవించు. 26

వ. పశుపతిం గుఱించి తపంబు సేయుము తత్ప్రసాదంబున నీకుం
జయం బయ్యెడుఁ బునర్దర్శనంబు గాఁగలయది పోయి
వచ్చెద నని యింద్రుం డంతర్ధానంబు చేసె. 27

తే. తండ్రి చెప్పినమాటలు దప్ప కప్పు
డాదరించి ధనంజయుం డభవుఁ గూర్చి
యింద్రకీలాచలంబుపై నేకనిష్ఠ
ధీరుఁ డొనరించె నతిఘోరవీరతపము. 28

మ. భసితోద్ధూళితనిర్మలావయవుఁడై న్బంచాక్షరీసంతతా
భ్యసనవ్యాప్తిపరాయణుం డును శివధ్యానానుసంధాతయున్
మసృణస్నిగ్ధతరక్షుచర్మమయకంథాభద్రపీఠుండు నై
[1]యసమస్థేమఁ గిరీటి పాశుపతదీక్షారంభముం గైకొనెన్. 29

1. తి. పా.



సీ. ప్రథమసంధ్యారాగపరిపాటి మిన్నేటి
కనకపంకజకోరకములు దెలుపఁ
గందువాఱినమింటఁ గప్పుటద్దమువోలె
విధుమండలము కాంతి వీడుకొనఁగ
పర మైనవేఁబోకఁ దఱపి వెన్నెలఁ గ్రోలి
దివిఁ జకోరములు మత్తిల్లి యాడ
మందరాచలకూటమధ్యభాగమునఁ
గృత్తికానక్షత్ర మత్తమిల్ల

తే. మృదులభస్మరజశ్శయ్య మేలుకాంచి
యమలరుద్రాక్షధారణం బాచరించి
యర్జునుఁడు పర్ణశాలికాభ్యంతరమున
హరున కొనరించు నరుణోదయార్చనంబు. 30

క. కపికేతుఁ డింద్రకీల
ప్రపాతపతయాళునిర్ఝరస్నాతుం డై
యుపచారవిధుల నన్నిటఁ
దపనోదయవేళ వ్యాళధరుఁ బూజించున్. 31

మ. అవధానంబున బాకశాసనసుతుం డర్ధేందుకోటీరు సం
గవకాలంబునఁ బూజసేయు హిమవాఃకర్పూరకస్తూరికా
ద్రవకాలాగురుగంధసారసురభిద్రవ్యంబులం బూవులన్
లవలీసర్జరసాగురుప్రముఖ నానాధూపధూమంబులన్. 32

శా. పంచబ్రహ్మషడంగబీజసహిత ప్రాసాద పంచాక్షరీ
చంచన్మంత్రపరంపరాపరమనిష్ఠాతత్పరత్వంబునన్

మంచుంగొండయనుంగుఁబెండ్లికొడుకున్మధ్యాహ్నకాలంబు సే
వించు న్నిర్జరరాజసూనుఁడు మనో[1]వీథీసదాధ్యాసితన్. 33

శా. [2]వైయాఘ్రాజినఖండమధ్యమున సేవన్ బద్ధపద్మాసనుం
డాయింద్రాత్మజుఁ డింద్రకీలశిఖరద్రారూఢబిల్వద్రుమ
చ్ఛాయానిర్మలచంద్రకాంతమణి పాషాణప్రదేశంబునన్, సా
యంకాలము పూజసేయు నభవున్సంధ్యానటుం ధూర్జటిన్.

ఉ. అంచితభక్తితోఁ శివుని నర్ధనిశాసమయంబునందు సే
వించు గురూపదేశమవిపరిశుద్ధసమర్చనావిధిన్
గాంచనకోరకంబులఁ బికప్రసవంబులఁ గొండగోఁగులన్, గాం
చనకందరాముఖగృహంబులఁ బొద్ధుఁడు సంస్కృతార్థుఁడై.

వ. ఇట్లు పాశుపతదీక్షాధురంధరుం డై కాలకంధరుంగుఱించి
తపంబు సేయుచుండఁ గొండొకకాలంబునకు. 36

మ. ఒకనాఁ డింద్రతనూభవుండు గిరికూటోత్సంగభాగంబున
న్వికచానేకలతాతతుప్రతతులన్ దేవార్చనాపుష్పకో,రకము
ల్గోయుచు నుండఁగాఁ వినఁబడెన్ శ్రవ్యంబులై కుర్కుర
ప్రకరోదంచితకంఠనాళకుహరాళిబౌబౌమహారావముల్. 37

తే. [3]చాయగోసులకంటెఁ గేసులకంటెఁ
బులులకంటెను బిరుసులై పొగరు మిగిలి
జల్లుకొనివచ్చెఁ బైపైని సారమేయ
యూథములు వేసమయమూర్తు లుద్ధతముగ. 38

తే. ప్రకటలీల నుదాత్తంపుఘనతఁ గొన్ని
క్రమముతో ననుదాత్తస్వరములఁ గొన్ని

1. వీథిన్సదానందుఁడై. 2. ఆయామ్రాజి... సేవాబద్ధ. 3. శరభమృగముల.

స్వాకితములఁ బ్రచయంబులవరుసఁ గొన్ని
ఘోషణము సేయఁ బోడఁగె నాకుస్కరములు. 39

క. కనకపుశృంఖలలఁ ద్రయీ
శునకంబులఁ బట్టుకొనఁగ సూచెల బ్రమథుల్
తను నిసుచక్రియ లీలా
వనచరులై కొలువఁ గపటవైహారికుఁ డై. 40

సీ. వికటపాటలజటామకుటికాభారంబు
కఱకైనజుంజుఱు నెఱులు గాఁగఁ
జాపసుధాధామశకలావతంసంబు
పెడకొప్పుపై నుండుపీఁకె గాఁగ
ఘనలలాటంబునఁ గనుపట్టుకనుచిచ్చు
గైరికద్రవతిలకంబు గాఁగఁ
భుజమధ్యమునఁ గ్రాలుభుజగహారంబులు
గురిజపూసలగుబ్బసరులు గాఁగ

తే. శంకరుండు కిరాతవేషంబు దాల్చి
యగజ చెంచెతయై తోడ నరుగుదేరఁ
బాణి నోంకారదివ్యచాపము ధరించి
వచ్చె విప్వచ్చువరతపోవనముకడకు. 41

వ. అట్టిసమయంబున. 42

చ. జలధరనీలదేహమును జంద్రకళాయుగళీసమానదం
ష్ట్రలు భిదురోపమానముఖసంపుటపోత్రము ఫుల్లమేచకో
త్పలవలవర్ణకర్ణములుఁ బాటలవర్తులలోచనంబులుం
గలిగి కఠోరకంఠ ఘనఘుర్ఘురఘుట్టనఘోషజన్మమై. 43

ఉ. ముట్టియ నింద్రనీలతటమూలమహీప్రభవంబు లైనపె
న్బుట్టలు ద్రోచ్చివైచుచును ఘోణమహాహలముఁ జాఁపకట్టుగా
మట్టుచు ఘుర్ఘురధ్వనుల మాటికిమాటికి దిక్పుటంబులం
ఘట్టన చేయుచు న్వెడఁదకన్నుల నిప్పులు వెళ్లఁగ్రాయుచున్.

క. పంది వడిఁ బాఱుదెంచెఁ బు
రందరనందననిశాకరధరులనడుమన్
దందడి గొరిజలతాఁకునఁ
గందుకములువోలె శిలలు గసవాఱంగన్. 45

ఉ. ఏసెఁ బినాకచాపమున నీశుఁడు గాండివకార్ముకంబునన్
వాసవసూతి యాప్రబలవజ్రసమానము లైనబాణముల్
రాసెఁ బరస్పరంబును వరాహముప్రక్కలు గాడిపాఱ మూ
కాసురసూకరంబు తెగఁగాడె వడి న్నరఘాతవేదనన్. 46

క. అభవార్జున శరపాత
ప్రభవవ్యథఁ దిరిగి నవ్వరాహము కడు సం
క్షుభిత మయి ప్రళయవేళా
నభస్వదుద్భ్రాంతఘనఘనాఘనము క్రియన్. 47

క. దీర్ఘతరహరవరాశుగ
నిర్ఘాతనిపాతజాతనిబిడవ్యథ నం
తర్ఘూర్ణమాన మగుచును
ఘుర్ఘురఘోషంబుతోడఁ గ్రోడము కూలెన్. 48

వ. అప్పుడు కిరాతవేషధారి యగుపురారి యోంకారచాపంబు నేల నిలువంబెట్టి తదీయశిఖరంబున నఱచెయి మోపి యొరగి యొయ్యారంపునిలుకడ నిలిచి వలకేల వాలమ్ము ద్రిప్పుచుఁ

గర్జిపర నున్నజగజెట్టి యగునింద్రునిపట్టిం గనుంగొని ప్రావృషేణ్యపయోవాహగర్జాగంభీరం బైనస్వరంబున నింద్ర కీలగిరిగహ్వరంబులు ప్రతిధ్వనియొసఁగ సాటోపంబుగా సగ ర్వంబుగా సావష్టంభంబుగా ని ట్లనియె. 49

తే. ఎవ్వఁడవురోరి నీవు నాయెదురఁ బాలు
పంపి నేసితి బాహాదర్పంబు మెఱసి
యెఱుఁగవుర యోరి నన్ను నీయింద్రకీల
పర్వతం జేలువచనరసార్వభౌము. 50

ఉ. ఏను నా కుటుంబ మగునీశబరశ్రేణియు (వేఁట)వెంటవెళ్లియి
కాననభూమిలో బహుమృగంబులఁ జంపుచువచ్చివచ్చి యే
నీనిశితాస్త్రపాతమున నిక్కిటిఁ జంపుదు నంచు వాక్ప్రతి
జ్ఞానిచయంబున న్వెనుకజాడఁగఁ గూడఁగ వచ్చుచుండఁగన్.

క. [1]ఏటులపి నేసి చెంచెప
యోటమివెట్టం గడంగి యున్నట్టియెడన్
[2]గాటెలుకున గోఱఁతిడి యిటఁ
జేటంబున వేఁట్కొల్లఁ జెఱిచితి కదరా. 52

తే. తపసి వై యుండి తగు రోరి ధనువుఁ బట్టు
శాంతిపరులకు నేలరా సత్వహింస
కపటధార్మిక ! యత్యంతకల్మషాత్మ !
యెవ్వఁడవు రోరి నాపంది నేయ నీవు. 53

క. మందెడుబలునారసమున
గుంపియు పగులంగ నేసి కూల్చితి దీనిన్

1. వేఁటనలసి యీచెంచేత. 2. గాటెఱుకు గోఱవింటన్.

వెండి ప్రయోజన మేదీ
రండాసుత! దీనిపై శరము నిగుడింపన్. 54

చ. తబిసివి గానఁ జావునకుఁ దప్పితి నీ కిది వేఁటపంతమా
[1]యబసరపుం దెఱంగునఁ బరాటవికాయతచాపవల్లరీ
నిబిడశరాహతం బగువనేచరజంతువు నేసి తీగతిఁ
సబముపయి న్నిగుడ్చునని శాతశిలీముఖ మెట్టివెట్టెదో. 55

వ. అనినం గిరాటి యయ్యాటవికచక్రవర్తి కిట్లనియె. 56

క. పైవచ్చుక్రూరజంతువుఁ
జేవెరవున నేయు టొందు సిగ్గే చెపుమా
యీవక్రభాషణంబులు
నీ వాడెదు శబర పొమ్ము నీచనుత్రోవన్. 57

క. పంది నపేక్షించితివో
పందెము గెలువంగ వేడ్క పడితొవ వేదో
కందువుగా కాఘలము పు
ళిందాధిప యేమిటికిఁ బలికె దీభంగిన్. 58

మ. తడవే లోరి పుళిందరాజ! చను మధ్యాహ్నంబు డాయంగ
న,య్యెడ నీవేళ శివార్చనంబునకు మా కేకాంత మై యుం
డఁగాఁ, బడు నీపుం గడు డస్సినాఁడ వటవీసంత్రిప్రచారం
బులన్, విడు కోపం బిదె శాంతి గైకొనుము [2]వాగ్వివాద
మిం తేటికిన్. 59

క. జోటియు నీవును గుఱ్ఱర
కోటియు ననుచరులు దప్పిగొన్నారు మహా

1. యబలుండ వీ తెఱంగున. 2. ధన్వీ.

ఘాటిపరిశ్రమమున ని
చ్చోట వసించెదవ యేని సుఖ ముండఁ దగున్. 60

వ. అని యర్జునుండు పల్కిన నాగజ్జులాఁడు మోఱకంబున నొగ వడ్డంబు గపల్కి యీ యొడ్డమాటలం బనిలే దీపంది యొక ప్రయోజనంబె వేఁటపంతంబు దప్పి మమ్ము నధిక్షేపించితి; పితృస్వనకుఁ దపసివి గాన నిన్ను శిక్షింపను పో మ్మదియునుం గాక. 61

ఆ. శాక్తియంతవిల్లు ధరియించినాఁడవు
జ్యాకిణాంకితము భుజాయుగంబు
గర్వరేఖ మిగులఁ గానంగ నయ్యెడు
దాంభికంబు నీదుతపసితనము. 62

శా. ఏమో నాహృదయంబు నిన్నుఁ గని [1]యిట్లే చాపముం దాపమై, భూమాసన్నిధి నుబ్బుచున్నయది నీబాహాప్రతాపంబు నిస్సీమం జేసెకకొంతసే పిచట నుజ్జృంభించి రాఁ జేయుమా, నామీఁద న్నిగుడింపుమా నిశితనానాక్రూర నారాచముల్. 63

క. చెంచని నన్నుం జూడకు
వంచింపకు హీనజాతివాఁ డని సంగ్రా
మాంచలమున నిదె నను నొ
ప్పించెదవే నపుడు నిన్ను సెబా సందున్. 64

మ. శివలింగార్చన మెంతవో యెడుఁ దపస్విత్వమ్ము నెందే నుపద్రవముం బొందదు లే, యొకింతవడిలో ధ్యానానుసంధాన

1. యిట్టిచ్ఛాపరాధీనమై.

ముల్, వ్యవధానం బొకయింత సైఁచవొకొ బాహావిక్రమ
శ్రీమహోత్సవముం జూపుడుగాక నాయెదుర నాశ్చర్యం
బవార్యంబుగన్. 65

తే. ప్రదర మరివోయు మేఁగుము ప్రాక్ప్రకార
కౌతుకాధీనహృదయుండఁ గాను నేను
ఔర కులపత్నిఁ గైనయీనీరజాక్షి
యాసపడుచుండు ఘోరవీరాహవములు. 66

వ. అని పల్కి యాక్రీడాకిరాతుండు గుణధ్వని చేసిన జలధర
ధ్వానగంభీరం బై యేతెంచునాప్రోఁతకు సిల్లు చూపినఁ
గోపించు గంధద్విపంబుంబోలె రోషించి యర్జునుండు గాండీవ
గుణగర్జాడంబరంబున నంబరంబు పిక్కటిల్ల నాటక్కరి విలు
కానిపై భల్లంబులు నిగుడించె. 67

శా. గాండీవప్రవిముక్తనిష్ఠురమహాకాండప్రకాండంబులన్
ఖండించె న్బ్రతిబాణఘట్టనమునం గంధర్వవిద్వేషి యా
తం డాశ్చర్యము నొంది బాపురె! పుళిందశ్రేష్ఠ! యంచు
న్భుజాదండాహంకృతి వెండియుం బఱపె శాతక్రూరనారా
చముల్. 68

శా. ప్రారంభం బొకయింత లేకను దృణప్రాయంబున ట్లొంటఁగాఁ
గ్రూరాజిం దెగనేసెనో నఱికెనో క్రొవ్వాఁడిఅంపంబుచే
నీరీతిం బనుమాడవచ్చునె యనన్ హేలాగతిం ద్రుంచె దు
ర్వారాహంకృతి నీశ్వరుండు విజయాస్త్రవ్రాతమున్ వ్రేల్మి
డిన్. 69

క. శతికంతుఁ డేయుశరములు
ప్రతిహతములు సేయు నరుఁడు పార్థునిశరముల్

ప్రతికంఠుఁ డేచు శరములఁ
బ్రతిహతములు సేయు బహుళబాహుప్రౌఢిన్. 70

క. క్రూరతరహరనవాశుగ
నారాచశిలీముఖాదినానాస్త్రఘటా
నీరంధ్రమైననభమునఁ
గారుకొనియె గాఢ మంధకారము దిశలన్. 71

క. ఓంకారగాండివజ్యా
టంకారంబులు నభఃకటాహము నిండెన్
శంకరకపికేతుభుజా
హంకారనిరంకుశాహవాంగణభూమిన్. 72

వ. ఇట్లు హోరాహోరి నల్లాడు హరార్జునులయందు. 73

క. శరధులు యుగాంతవేళా
శరధులునుం బోలె నయ్యె శరశూన్యంబుల్
సురపతిసూతికిఁ బరమే
శ్వరమాయాశక్తి నపుడు సమరాగ్రమునన్. 74

మ. తెలిపిం బొంపక యుండె నెమ్మనమునం దివ్యాస్త్రమంత్రాక్షరం
బులు శౌరవ్రతకుంభసంభవుపదేశంబు సర్వంబు నిష్ఫల
మయ్యెన్ వృథ యయ్యె నాంతరకృతాభ్యాసంబు గాండీవికిన్
గలహక్షోణిఁ బినాకపాణికుహనాకౌటిల్యశిల్పంబునన్. 75

క. నిటలవిలోచనమాయా
ఘటనమునఁ గిరీటి తన ప్రగల్భత చెడినన్
గుటిలముగ బొమలు ముడిచెను
గటకటపడఁ బొడఁగె నపుడు కరము నెమర్చెన్. 76

శా. కాండక్షీణత నాయుషశ్చ్యుటలకుం గల్గెంగదే నాథనుః
పాండిత్యం బెటువోయె నొక్కోయని చెప్పం జిట్టలోఁ గాకయీ
తం డీలాగునఁ బోవువాఁడె మయిమైఁ దానంచు గర్వోద్ధతిన్
గాండీవంబునఁ బూన్చి వేయఁ దొడఁగె న్గాండీవి గంగాధరున్.

క. మృడుఁ డెన్నఁడు శరములఁ గ
వ్వడి [1]యుడువం దొడఁగె గాండివంబున నపుడే
యుడుగక పొడమెడుభయమున
వడఁకుంగుబ్బలికుమారి వడవడ వడఁకెన్. 78

సీ. కలికి వెండ్రుకలలోఁ బలుచుమందాకిని
సుకుమారదేహంబు సుక్కఁబాఱె
నవతంసకుసుమమాల్యం బైనశశిరేఖ
బ్రహ్మకపాలరంధ్రమునఁ దూఱె
నెట్టియంబుగ బిగ్గఁజుట్టిన పెనుఁబాము
బిగియూడి నొసలిపై డిగఁగ జాఱె
నలికనేత్రముకిత్తి యారజ్యమానమై
తెప్పలసందుల నిప్పు లుమిసె

తే. నగజ భయమందెఁ బ్రమథులు బెగడుగుడిచి
రుపనిషత్తులు ఘోషించె నొక్కపెట్టఁ
గాలకంఠునిమౌళిశృంగాటకంబు
గాండివంబునఁ దాడింపఁ బాండవుండు. 79

తే. పాండునందనఘనభుజాదండకలిత
చండగాండీవతాడితఖండపరశు
పృథుజటామండలంబునఁ బిండుగట్టి
తాండవం బాడె మున్నెటితరఁగ[2]వండు. 80

1. పొదువం. 2. పిండు.

తే. వింటఁ గొని వ్రేయవ్రేయంగ విసుగు పుట్టఁ
జెట్టివిధఁ బింతె పొమ్మని పట్టి యణఁచె
సురతనూభవునిం బట్టి శూలపాణి
మల్లసంగ్రామకేళిసంభావనముల. 31

క. కపికేతువృషభకేతను
లుపజాతనియుద్ధకౌతుకోత్సాహమునన్
నిపుణతఁ బెనఁగంగఁ దొడఁగి
రుపతాయిన్ [1]గతివిశేష ముపలాస్యముగన్. 32

తే. తోరహస్తంబునందుఁ బార్థుండు గడిమి
సలిపె సూరులుఁ బీడించె సరభసమున
హరుఁడు సీసాన హత్తించి యర్జునునకు
బహువు గావించె నిశ్వాసపవనమునకు. 33

క. ముక్కంటి కంఠమూలము
డొక్కరమున నిఱికెఁ బార్థుఁడు ప్రబంధుండై
చక్కని ప్రకోష్ఠపీడన
మిక్కిలికను [2]వెలికి నుఱికి మినుమినుకు మనన్. 34

క. తాఁచుచుఁ బొడుచుచుఁ బఱచును
నేఁచుచు నుఱుకుచును బిట్టు నెగయుచు గూలం
ద్రోచుచుఁ దూలుచుఁ బెనఁగిరి
ప్రాచీపతిసుతుఁడు హరుఁడు బాహాబాహిన్. 35

శా. నిష్టంకించి శశాంకశేఖరుఁడు గాండీవాయుధుండు న్భుజా
వష్టంభంబులు సిద్ధచారణులుఁ గైవారంబు గావింపఁగా

1. వేషభాష లుప. 2. వేఁకినుఱికె.

దిష్టాంతాంతకఘోరమూర్తు లయి సాదృశ్యం బదృశ్యంబుగా
ముష్టాముష్టి రణంబు చేసిరి [1]యసన్మోహ ప్రకారంబులన్. 86

క. చెమరుచుట యాడుగఱచుట
బొమముడుచుట నిర్వికారమును మును సపరి
శ్రమమును సరిసరిఁ బెనఁగిరి
సమవిషమనియుద్ధకేలి శంభుఁడు నరుఁడున్. 87

క. తాటించెఁ బేరణము నా
స్ఫోటించెఁ గిరీటివక్షము వృషాంకుఁ డతం
డాలోపమఱక పిడికిటి
పోటున ధూర్జటియురంబుఁ బొడిచెం గడిమిన్. 88

శా. అంతం జంద్రకళాధరుండు నిజబాహాగాఢపీడాపరి,శ్రాంతుం
డై యటఁ బాండుసూతియొడరం బ్రత్యక్షమయ్యెం గృపా
వంతుం డై యహిరాజహారములతో స్వర్వాహినీవేణితో
దంతిత్వక్పరిధానపల్లవముతోఁ దామ్రజ్జటాపంక్తితోన్. 89

ఉ. [2]చెంచెత యయ్యెఁ బార్వతియుఁ జెంచులు భూతము లై నిజా
కృతి, న్మించిరి వేలుపు ల్నభము మీఁద లలాటమునందు నంజ
లు, ల్నించి నమస్కరించిరి వినీతియు భక్తియు నుల్లసిల్లఁగా
పించెఁ బ్రణామముల్గరము విస్మయమందుచుఁ బార్థుఁ డత్తఱిన్.

తే. వేదముల్నాల్గు నుపనిషద్విద్యఁ గూడి
ప్రణవమంత్రాక్షరములతోఁ బ్రస్ఫుటముగ
విశ్వకర్తృత్వ మొయ్యొయ్య విడుకొనుచు
నభినుతింపంగఁ దొడఁగెఁ జంద్రార్ధమౌళి. 91

---

1. యసన్మోహ. 2. చెంచెతయైన పార్వతియుఁ జెంచులుభూతములు న్నిజాకృతిన్.

వ. అప్పుడు పార్థుండు కృతార్థుండై రోమాంచితకంచుకితాఖిలాంగుండై యానందబాష్పలోచనుండై కేలుదోయి ఫాలభాగంబునం గీలుకొల్పి యిట్లని స్తుతించె. 92

సార్వవిభక్తిక స్తవము

క. నీవ పరబ్రహ్మంబవు
నీ వఖిలాండాండపతివి నీవు ప్రసన్న
శ్రీవిభవారోగ్యాయుః
ప్రావీణ్యప్రాభవైకఫలదుండవు శివా! 93

క. నిన్నుం ద్రిజగన్నివాసునిఁ
బన్నగకంకణుని భక్తపరతంత్రుని న
భ్యున్నతకరుణాగుణాసం
పన్నుని గనుఁగొంటి మంచి బాలేందుధరా! 94

క. నీచేతఁ గృపానిధిచే
వాచాగోచరవివేకవైయాత్యునిచే
నోచంద్రకలాశేఖర!
యాచించి మనోరథార్థ మర్థిం గందున్. 95

శా. నీకై యేను దపంబు చేసితి మహానిష్ఠాగరిష్ఠస్థితి
న్నీకై సంస్తుతి సేయుదుం గడఁగి నానేర్పొప్పఁగా నెంతయు
న్నీకై పూజ యొనర్తుఁ గ్రొత్త విరుల న్నిత్యంబు సద్భక్తితో
నీకై సేవ యహర్నిశం బొనరుతు న్వేదండచర్మాంబరా! 96

తే. సాటి యెవ్వరు నీకు నిశాటభూష!
కైటభారాతిహాటకగర్భవంద్య!
ఘనజటాజూటవాటికాఘటితవికట
గగనగంగాస్రవంతిక! కరటివైరి! 97

క. నీయందు జగము లుండుం
బాయక యాజగములందుఁ బాయక నీ వుం
దీయనువు దెలియ నజునకుఁ
దోయజనేత్రునకు నైనఁ దోఁపదు శర్వా! 98

మ. జయ సర్వేశ్వర! సర్వలోకజనకా! చంద్రార్ధచూడామణీ!
జయ కామాంతక! కామితార్థఫలదా! చక్షుశ్శ్రవఃకుండలా
జయ సంపూర్ణకృపాగుణైకవసతీ! శైలేంద్రజావల్లభా!
జయ దక్షాధ్వరమర్దనా! జయ గిరీశా! యీశ! రక్షింపవే.

ఉ. కొండకిరాతుఁ డంచుఁ గయికోక యసంగతభాషణంబు లు
ద్దండత నాడితిన్ గర ముదగ్రత నొంచితి ముష్టిఘట్టనం
గాండివచాపదండమునఁ గ్రచ్చుఱ మోదితి మౌళి భోగభృ
త్కుండల! పెక్కుచందముల ద్రోహము చేసితి నేమి
సేయుదున్. 100

వ. అని మఱియు మఱియు సాష్టాంగప్రణామంబు లాచరించి నిలిచిన పాండవ మధ్యముం జూచి ఖండపరశుండు నీతపంబునకుఁ బాశుపతవ్రతనిష్ఠాగరిష్ఠతకు భుజాశౌర్యంబునకు సంతసిల్లితి నీవరం బెదియె వేఁడు మనుటయు. 101

తే. అభవ! యీ నాకు నీప్సితం బగువరంబు
దయఁ బ్రసాదించి రక్షింపఁదలఁచితేని
రౌద్ర మై ఘోర మై లోకరక్ష యైన
పాశుపతసంజ్ఞ మగుదివ్యబాణ మిమ్ము. 102

వ. అనినం బ్రీతచేతస్కుండై శంభుండు శాంభవీహృదయాను
రాగంబునను బ్రమథపరివారసమక్షంబునను మందస్మితంబు
కదళింపఁ గరుణాకటాక్షవీక్షణంబున నప్పాండుకుమారుం

జూచి త్రిపురదైతేయసుందరీ వదనారవిందవాసరావసాన సంధ్యాసమయ సమారంభంబును గరటిదనుజకుంభకూట కూటపాకలజ్వర (కీర) స్తోమంబును జలంధిరజలధరవ్యూహ జంఝూసమీరంబును నంధకాసురప్రద్యోతన ప్రభామండ లంబును శార్దూలదానవారణ్యహవ్యవాహంబునునగునమ్మహా సీయదివ్యాస్త్రంబు ససంప్రయోగంబు సోపసంహారంబు సకీల కంబు సరహస్యంబుగా నుపదేశించె నప్పుడు సేవాసమాపన్ను లగు కిన్నరకింపురుషగరుడగంధర్వ విద్యాధరులు తమ తమ దివ్యాయుధంబు లిచ్చిరి. పార్వతీదేవి యక్షయబాణ తూణీరంబు లొసఁగె. దండధరుండు దండంబును బాశపాణి పాశంబును నింద్రుండు వజ్రంబును సమర్పించి రిట్లు వర ప్రదానంబు సేసి యీశానుండు సపరివారుండు సాంబుండు నై యంతర్ధానంబు సేసె ననంతరంబ. 103

తే. పరమసంతోషమును బొంది బలవిరోధి
పుత్త్రుఁ గౌఁగిటఁ జేర్చి యాపోనికరాక్షి
సమ్మదాశ్రుకణంబులు సంప్రఫుల్ల
చక్షురంభోజవళిసహస్రమునఁ బొడమ. 104

వ. ఇట్లనియె. 105

ఉ. భాగ్యముగాదె యశ్రమమ పన్నగకంకణుచేఁ దపఃక్రియా
యోగ్యతఁ జేసి విశ్వభువనోపకృతిప్రతిపాదనైకసా
భాగ్యధురంధరం బయినపాశుపతాస్త్రము గాంచి తింక వై
రాగ్యము పుట్టుఁ గాక కురురాజుపయి న్నిజరాజ్యలక్ష్మికిన్.

వ. నీవు నారాయణసఖుండ వైన యాదిమునీశ్వరుండవు. నరనా రాయణులవలనఁ బ్రసిద్ధపంబునకుఁ బెక్కుతోయములు

రాక్షసబాధలు శాంతిం బొందె నిప్పుడు హిరణ్యపుర వాసులు నివాతకవచకాలకేయాఖ్యు లగుదైతేయులు రాజ్యలుబ్ధులై నాకంబున నేకప్రకారంబుల నుపద్రవం బాపాదించుచున్నవారు. వారిం బరిమార్చి (ర్చు) నమరావతీపురంబునం గొన్ని దినంబులు వ్రతోపవాసప్రయాసఖేదం బపనయించి మధ్యమ లోకంబునకుం గ్రమ్మఱ నేతెంచునది. మాతలిసారథికం బగు రథంబు ప్రత్తెంచెద నిచ్చోటన యుండునది యని తత్కాల సన్నిహితుం డైన రోమహర్షుం డను మునిం జూచి నీవు ద్వైతవనంబునకుఁ బోయి పాండవుల కర్జునకుశలవార్తయుఁ బాశుపతాస్త్రలాభంబును స్వర్గగమనంబుం జెప్పు మని పల్కి యింద్రుం డు నిజస్థానంబున కరిగె. 107

ఆ. విశ్రమించె నొక్కవృక్షంబుక్రీనీడ
నర్జునుండు మణిశిలాంతరమున
ఖండపరశుబాహుదండనిక్షేపణ
ముష్టిఘాతఖేదమోక్షమునకు. 108

శా. మాళిం గోహాళి సంఘటించినక్రియ న్మధ్యాహ్నవేళ న్మహా
కాళం బైననభోవిభాగమున వీఁకం గాసె బీరెండ యా
ప్రాలేయాహితసంప్రదీప్తకిరణప్రక్రీడదర్కోపల
జ్వాలాజాలజటాలజాంగలతటీవాచాలకోయష్టి యై. 109

వ. అప్పుడు మధ్యాహ్నకాలపూజకు నాయితం బై. 110

సీ. పావననిర్ఝరాంభఃప్రవాహంబున
నఘమర్షణస్నాన మాచరించి
కపటువోఁ దెలినీటఁ గడిగి యీటార్చిన
సలిలకాషాయవల్కలము గట్టి

యాపాదమస్తకం బఖిలాంగకంబులం
గమ్మనిభసితంబు గలయ నలఁది
వెడఁదముత్యములతో నెఱవెట్టి గ్రుచ్చిన
మంచిరుద్రాక్షదామములు దాల్చి
తే. పులికళాసంబుగట్టి పైఁ బూని క్రొమెఱయఁ
బంచశుద్ధులు గావించి పాండుసుతుఁడు
షోడశోపచారంబులు సొరిది నిచ్చె
నీలగళునకు మధ్యాహ్నకాలవేళ. 111

వ. ఇట్లు శివలింగార్చనంబు చేసి కందమూలఫలోపహారంబులు సమర్పించి తత్ప్రసాదంబునం దానును దేహయాత్ర నడపి విశ్రాంతుండై యున్నసమయంబున ధవళహయసహస్రంబులం బూన్చినరథంబు గొనివచ్చి మాతలి తనకుం బొడసూపిన సబహుమానంబుగా నాదరించి పురందరాదేశంబున నద్దివ్యస్యందనం బెక్కి యాకాశమార్గంబునం జనునప్పుడు.

సీ. ఇది మేఘమండలం బివె విమానంబులు
యక్షవిద్యాధరోపాశ్రయంబు
లివి యావహస్కంధ మదె తారకావీథి
యల్లతెల్లనిరేఖ యభ్రగంగ
యల్లదె శింశుమారాకారహరిమూర్తి
వీఁడె భాస్వంతుఁడు వాఁడె ధ్రువుఁడు
వీరె సప్తర్షులు వారె యశ్విన్యాదు
లిరువాడ దేవేరు లిందుభార్య
తే. లల్లవాఁడెసుధాకరుం డవెగ్రహంబు
లివ్విలాఖ్యంబు లగుచుక్క లివె కేతువుల

ననుచు మాతలి చూపంగ నర్జునుండు
గౌతుకం బంది గగనమార్గంబునందు. 113

శా. జంభారాతితనూజుమీఁదఁ బొలిచెన్ సావిత్రవస్త్రంబున
న్సంభిన్నోదరజాతకుంభనలినీరాలీకసంవాసనా
సంభారంబులు సోఁకు ముట్టి సవిధస్వర్లోకకల్లోలినీ
గంభీరాంబుతరంగసంభ్రమములం గల్యాణవాతూలముల్.

తే. అర్జునునిమీఁదఁ బొలిచెఁ బథ్యంతరమున
నభ్రగంగానదీతరంగానిలంబు
నందనోద్యానవీథికానవలతాంత
[1]సౌరభాసారలహరీవిహార మగుచు. 115

వ. ఇవ్విధంబున మాతలిసారథికం బైన యారథంబుమీఁద నక్షత్రమండలం బొఱసికొనుచుం జని యర్జునుం డమరావతిం బ్రవేశించి దివ్యాంగనాపాంగ భంగీసమాలింగిత సౌభాగ్యం బై రాజమార్గంబునం జని దివ్యమందిరంబుఁ బ్రవేశించి సుధర్మాభిధానం బైన యాస్థానమండపంబునఁ గొలువున్న మహేంద్రు నర్ధాసనంబున నుండె. 116

తే. విడుపట్టుగ మందారవిపినవీథి
దివ్యసౌధంబునందుఁ బ్రతిష్ఠఁ జేసి
గారవించె జయంతకుమారకం బోఁ
బాండురాజతనూజు నాఖండలుండు. 117

వ. ఆ నిశాసమయంబున. 118

సీ. పదునాల్గుజాతుల త్రిదశాంగనలయందుఁ
పేరుఁ బెంపును గలనీరజాక్షి

1. సౌరభాసురవారినీలహార మగుచు.

నీరజనాభునియూరుకాండంబున
నుద్భవం బందినయుజ్జ్వలాంగి
యంభోనిధానంబు నాపోశనము గొన్న
కలశసంభవుఁ గన్నకంబుకంఠి
వసుధయం దెసఁ బురూరవశ్చక్రవర్తికిఁ
బ్రాణవల్లభ యైన పద్మనయన
తే. కట్టి తోడి పూసి కైసేసి కౌతుకమునఁ
గొప్ప దిగఁగ నీలిపుట్టంబు ముసుఁగువెట్టి
గాజు లెగఁ ద్రోసి చప్పుడు గాకయుండ
వచ్చె నూర్వశి యర్జునావాసమునకు. 119

చ. విమలసుధాంశుకాంతమణివేదికపై నవహంసతూలత
ల్పమున సుఖప్రసుప్తిపరిపాకము నొంది విశాలనేత్రప
క్ష్మములు మొగిడ్చి శేషఫణిపైఁ బవళించినయంబుజాక్షుభా
వమునఁ గరంబుఁ బొల్పమరువానిఁ గనుంగొనె నింతిపార్థునిన్.

తే. మేల్కొలిపి యిందుబింబాస్య మెల్ల మెల్లఁ
బ్రమదనిద్రాపరాధీనుఁ బాండుతనయుఁ
బగడములఁ బోలుతనపాణిపల్లవముల
నతనిమృదుపాదపంకేరుహంబు లొత్తె. 121

వ. మేల్కాంచి యర్జునుండు నిర్జరలోకలలామంబైన యబ్భామినీ
రత్నంబుం గనుంగొని పాన్పు డిగ్గి యభివాదనంబు సేసి
వినయవినమితోత్తమాంగుం డై యిట్లనియె. 122

తే. ఈనడికిరేయి నొంటిమై నింతదూర
మేమికార్యంబు మదిఁ గోరి యేఁగుదెంచి

తేను రమ్మన్న రానె పూర్ణేందువదన!
చెప్పుమీ పాన్పుమీఁద విచ్చేసియుండు. 123

ఉ. ఆడఁగఁబోవుతీర్థ మెదురై నవిధంబున నెల్లియేను రే [త్రో
పాడియ చంద్రశేఖరు నుపాస్తి యొనర్చి యుపాయనంబు
జూడఁగవచ్చువాఁడ నయి చూచుచు నుండఁగ నీవ వచ్చితో
చేడియ! యెట్టిపుణ్యములు చేసినవాఁడనొ ప్రాగ్భవంబునన్.

శా. మత్తారాతివిదారణుండు జనసన్మాన్యుండు శీతాంశువం
శోత్తంసంబు పురూరవుండు ప్రచలద్యోగుండు మాతాతగా
రత్తోయాకరమేఖలాపతికి నిల్లాలైతిగా కావునన్
ముత్తోవి విది లెస్స మన్ననిపయిన్ మోహంబు వాటింపఁగన్.

తే. ఆదినారాయణునియూరు వంబుజాక్షి!
భువనవిఖ్యాత మైననీపుట్టినిల్లు
పావనుఁడ నైతి నీ పాదపద్మములకు
వందనముఁ జేసి వరభక్తివై భవమున. 126

వ. అని పెక్కు ప్రకారంబుల నిర్వికారుఁడై పాండుకుమారుండు ప్రియంబుచెప్పిన నప్పువ్వుఁబోఁడి కప్పుల్కు లొప్పులయ్యును నీరుడప్పికి నేయునుం బోలె యప్పటి కప్రియంబులై యుండె నిచ్ఛావిఘాతంబు నొందియు నమ్ముచ్చెకంటి చేతోభవవికారంబు హరింపం జాలక ధనంజయున కిట్లనియె. 127

తే. ఏల యెన్నోతరంబుల నీడఁ బడ్డ
పెద్దవావులు శోధించి గుద్దలింప
వారకాంతాజనములకు వావి గలదె
మాను మర్జున మొగమోట లేనిమాట. 128

ఉ. పాంప్రనింపఁగొల్వునకు వచ్చినయప్పుడు తత్సమంచితా
స్థానమెక్కి యున్ననిను నంగజసన్నిభుఁ జూచి పుష్పబా
ణాసనుపుష్పబాణనివహమ్ములకుం గుఱియైతి నిట్టినా
యాస నిరాకరింపఁ దగవా తగవాఁ దప్ప కావ యర్జునా!

తే. ప్రమద మెసలారఁ బాంచాలరాజసుతకు
వలచి చేసితివో సత్యవాక్ప్రతిజ్ఞ
యన్యకాంతల దెసఁబోవ ననుచు నీవు
భామలకుఁ జేయుసత్యంబు పాడిగాదు. 130

క. నామోహము నావేడుక
నామానము నాప్రియంబు నాతగులము నా
ప్రేమమ్మును నాతెగువయు
కామముఁ బొందంగ నూరకమా పోవుదునే. 131

చ. అతులితధైర్యశౌర్యమహిమాద్భుతసాహసులై మహో
గ్రతా, ప్రతతనిశాతనిష్ఠురపత్రపాతవిదారితదేహులై రణ
క్షితిఁ బడి వత్తురై దుపదినేయక నాకయి యిట్టినన్ను నీ
వితరులఁ బోలెఁ గైకొనక యేఁచెద వక్కట పాండునందనా!

క. వేసాలఁ బోకు రమ్మా
ప్రాణజ్ఞకుఁ బ్రొద్దువోయెఁ బలియుట చాలుం
బాండవనందన! కుసుమశ
రాసనకేళీకలావిహారంబులకున్. 132

వ. అని పల్కి యంత నిలువక బ్రహ్మచర్యవ్రతదీక్షాపరాయ
ణుండవై నీ వనుచు నారాయణోపస్తంభంబున సంభవించిన
యపస్యచ్ఛురలేమ లేమొలకనవ్వులపొంగంబునం బొంగలింపఁ
గంకణఝణఝణత్కారంబు తోరంబుగాఁ గెంగేలికేళీకమ

లంబునఁ బరాగరేణుత్రసరేణువిసరంబులతోడం గూడి మక
రందబిందుధారాస్యందంబు చిందఁ బురందరనందనుని వ్రేసె;
వ్రేసిన నత్యంతధీరోదాత్తుండు గావునఁ జిత్తభవసమ్మోహనా
స్త్రవిదారణంబునకుం దాత యగు నవ్వోరిటునకుం గిరీటి
యంతరంబున మిసిమింతుండును గాక యేపాకంబునకు
రాక రాకాచంద్రబింబంబువోని నెమ్మోము వాంచి నిర్వ
కారుండై యూరకుండె నివ్విధంబున నయ్యూర్వశియు
వసిమాలఁ బెనంగి యక్కిరీటి చిక్కని మనంబుపక్కు గానక
కానక కాసిన వెన్నెలయుంబోలెఁ దన కన్నులవలపు మిన్నక
పోలిపోయినం జిన్నవోయి నిట్టూర్పులు నిగిడించుచు మనో
రథవిఘాతప్రభవం బైన కోపంబు సైరింపక నను నుద్దేశించి
నపుంసకుండవుంబోలె నాన గొన్నాఁడ వేఁడుకాలంబు
నపుంసకుండవు గమ్మని శపించి దిగ్గన లేచి మొగంబు గంటు
వెట్టుకొని యింటికిం బోయె. యుధిష్ఠిరానుజుండును వసిష్ఠ
జననివలన గతకీర్తితాపన్నుండై యయ్యరిష్టంబునకు సంతా
పంబు నొందక యది విధివశంబుగాఁ దలంచుచుండె; నప్పుడు
గగనంబుక్రేవంబడి యస్తమండలుండై హిమగభస్తి విరహ
వేదనాదూయమానమానస యగు మైత్రావరుణజనయిత్రి
ఖిన్నవదనంబునుంబోలె వెలవెలఁ బాఱ విభావరీసమయం
బునం ద్రిభాగావశేషం బగుటయు. 134

సీ. పారిజాతకలతాపల్లవంబులు మేసి
కొసరె నుద్యానపుంస్కోకిలములు
కంధరాగ్రవేయకనకఘంటిక మ్రోయ
వేల్పుటేనిక యుపర్వీధికి వెడలె

మందాకినీవీచిమారుతం బల్లార్చె
నప్సరస్త్రీలనీలాలకముల
సప్తర్షిపావనాశ్రమవనాంతరమున
నామ్నాయఘోష మభ్యధిక మయ్యెఁ
తే. బాలవత్సంబుపైఁ గూర్మిఁ [1]బంచితిలుచుఁ
[2]గామగవి నేఁపువచ్చి హుంకారమిచ్చె
శక్రుగడియారమున మించె శంఖరవము
విబుధలోకంబునందలి వేగుఁబోక. 135

తే. మర్త్యలోకంబువారి ప్రమాణసంఖ్యఁ
బాండుసూనుండు గడపెను వజ్రియింట
పగము నిద్రయును పగను జాగరమును
నావిభావరివేగుఁ బో నాలు నెలలు. 136

సీ. మాటుగా వైచినమాంజిష్ఠ తెర మెత్తి
సంజపెంచము డిగ్గి మంజుఘోష
మొకరిమత్రిస్రోత ముద్దుచూపఁగ రంభ
కనకంపుగోడుగుపాగాల్లు వోడిగె
నోకట వేనలి మష్పి యొక్క కేల ఘృతాచి
గాజుటెక్కులతల్పు గడియపుచ్చె
వలపుభావముతోడ నవ్వొక ప్రమ్లోచ
నిల్వుటద్దంబులో నీడ చూచె
తే. హారిణి గీలించె నలినపట్టాంశుకంబు
మేనక ధరించెఁ బాలెండ్లమీఁద అవిక

---

1. బచ్చుడిలుచు. 2. గామధుగ్గవివచ్చుహుంకార మెచ్చె.

యప్సరస్త్రీ నికేతనాభ్యంతరములఁ
గొక్కురోకో యటంచును గోళ్లు గూసె. 137

మ. అమరావత్యమృతాశను ల్ప్రథమసంధ్యావేళ వాల్గన్నులం
గమలాప్తుం గని యాచరించిరి నమస్కారంబు క్రిందై నమ
ధ్యమలోకంబున దివ్యదంశువ్రల నీహారప్రతానంబు భం
గమునొందించుచు మిన్నుఁ బ్రాఁకె నుదయగ్రావప్రదేశం
బునన్. 138

సీ. పరమర్షి పావనపాణిపల్లవములు
ఫాలభాగములపైఁ బవ్వళింపఁ
బౌలోమి పెంచినబాలకోకద్వయం
బలఁతియీరెండకు నట్టు సాఁప
గగనకల్లోలినీకనకపద్మములపైఁ
దుమ్మెద లెగసి ఝుంఝుమ్ము రనఁగ
నాకవిద్యాధరీనాట్యశాలలయందుఁ
దూర్యత్రయంబులు దూఱఁగలింపఁ

తే. భ్రమద దిక్కాంత కెంగేలఁ బట్టియాడు
క్రొత్తగురివెందపూసలగుత్తివోలె
దివసకామిని ముఖలక్ష్మి తెలివినొంద
బూర్వదిశయందుఁ గరకరఁ బ్రొద్దువొడిచె. 139

వ. అయ్యవసరంబున. 140

శా. కాల్యాచారము లాచరించి కడఁకం గౌరవ్యశార్దూలుఁ డౌ
జ్జ్వల్యస్ఫూర్జితవస్త్రభూషణవిశేషస్ఫూర్తి యై విస్ఫుర
న్మాల్యాలేపనుఁ డై విచిత్రబలశుంభద్భవ్యదివ్యాస్త్రసా
ఫల్యప్రౌఢతపోనిరూఢవిభవభ్రాజిష్ణుఁ డై యున్నతిన్. 141

క. బలవదరినికరనిర్భర
బలసాదనబాహుదర్ప బంధురలీలా
కలనవత మొనఁగ వచ్చెను
బలసూదనుసభకు భక్తిభావం బలరన్. 142

వ. వచ్చి సాష్టాంగం బెఱఁగిన ఫల్గును నఫల్గువాత్సల్యహేలా సముత్సేకంబున గాఢగాహనసంభావితుం జేసి జంభభేది యతని నాత్మీయసింహాసనార్ధంబున నుపవిష్టుం గావించి యి ట్లనియె. 143

సీ. బాహాబలాటోపపరిపాటి మెప్పించి
పశుపతి వీక్షానుపాశుపతము
సంగ్రహించితివి శస్త్రమ్ము లిమ్మడిగాఁగ
బొరపై రికమణ నిర్జరులవలన
నధికరించితి వస్త్రదాచార్యకంబునఁ
జతురంబు లగుదివ్యసాధనములు
కొఱంత లేకుండఁ గైకొంటి కుంభజుచేత
నైజంబుగాఁ జాపనైపుణంబు

తే. పరశుపట్టిసముద్గరప్రాసముసల
ఖడ్గముఖచిత్రచంక్రమక్రమనిరూఢిఁ
[1]గరిమ మేదిని సాటి నీ కరయఁ గలరె
శౌర్యమున నుగ్రభుజవీచి సవ్యసాచి. 144

శా. వేరీ నిన్నెదిరింపఁగా జగమున న్వీరు ల్పరితాపోద్ధతిం
ధౌరంధుర్యమునం బ్రభావమహిమం ధైర్యంబునం జాపలీ
లారంభంబున సాహసిక్యమున బాహాశక్తి దివ్యాయుధో
దార ప్రౌఢిమ దేవదైత్యనరగంధర్వాదిసంఘంబులన్. 145

---

1. గరము.

క. నీ పని సేయ బలాఢ్యుఁడ
వీవిశ్వంబునను నీకు నెదు రెవ్వరు లే
రావంత యైన వదలకు
మేవలనను దేవవిప్రహితకార్యంబుల్. 146

క. ఏపున భుజగర్వోన్నతి
ప్రాపున దీపింప నిట సుపర్వహితార్థం
బో పార్థ! చేయవలయును
నాపనిచినపంపు పెంపున న్శౌర్యనిధీ. 147

చ. అలఘుబలు ల్నివాతకవచాఖ్యులు వీరులు ఘోరదానవు
ల్జలనిధిఁగొంచి నుండుదు రసాధ్యులు నిర్జరసిద్ధసాధ్యకుం
డలినరకిన్నరద్యుచరనాయక కోటికి మూఁడుకోట్లవా
రలవలనం గలంగెడు నిరంతరబాధల ముజ్జగంబులున్. 148

చ. మఱియును నెందఱేని నసమానబలు ల్సురలోకకంటకు
ల్తఱచుగ బాధ చేసెదరు దైత్యు లవధ్యులు నిర్జరాళి కే
త్తెఱ నెఱయంగ వీర! భవదీయశరాప్తులపాలు సేసి యం
దఱ నుఱుమాడి యెంతయు హితం బొనరింపుము మాకు
నర్జునా! 149

వ. అని సునాసీరుండు సమారాధనంబున. 150

క. తనతొడినభూషణంబులు
తనదుకిరీటము నభేద్యతరకవచంబుం
దనసుతున కొసఁగి గాండివ
ధనువున నగజయము గుణము దాఁచి కడంకన్. 151

క. హయము లనూరుసవర్ణము
లయుతంబు వహింప సూతుఁడై మాతలియు

న్నియమింపఁ దనరునరదము
నయనము నెక్కఁగఁ బనిచి హర్షం బెసఁగన్. 152

తే. అసురలోకంబు నిర్జింప ననుపఁ బొంగి
సంగరోత్సాహ మెదలోన సందడింప
నడప నెంపున నరుగునయ్యర్జునునకు
నిర్జరులు హర్షమున ని ట్లనిరి కడంగి. 153

సీ. ఈరథం బెక్కి మున్నింద్రుండు నిర్జించె
శుంభన్మహాధృత్యు జంభదైత్యు
సీరశాంగమున బర్హిర్ముఖేంద్రుఁడు
త్రుంచె నాజిని త్వష్ట్రు వృత్రాసురేంద్రు
నీయరదంబున నెగిచె గోత్రవిభేది
పరిపంథిఘనమహాబలుని బలుని
నీ తేరఁ గావె మాయించె సుత్రాముండు
పాకదైతేయు నిర్భయసహాయు

తే. నీమహాస్యందనంబున నేపు మాపె
నముచిముఖదానవశ్రేణి నమరవిభుఁడు
నీవు మాతంత్రి యట్లన నిఖిలదనుజ
పతుల నోర్వుము దీనిచేఁ బాండవేయ! 154

వ. అని పల్కి దేవసంబంధం బైనదేవదత్తం బను శంఖం బిచ్చి
నం బుచ్చుకొని యర్జునుండు మాతలియుం దానును దద్ర
థాధిరోహణంబు చేసి నివాతకవచవధార్థం బతిరభసంబున
నరుగువాఁడు మున్నటఁ గరిమకరికరోరఘూత్కారవారి
ధారాలవాసారపూర్యమాణరోదసీనిరంతరాకాలసంసాటి
తోడంభ్రమంబును ఘనఘనాఘననిపీయమానభువనవర్తితా
వర్తవేగజనిత మథనవిరచితానేకమంథానకుహరవిభ్రమంబును

నమలడిండీరపిండఖండమండితాఖండపాండుర్య ధుర్యరోచిర
నిశాసాంద్ర చంద్రికాక్రాంత దశదిశాభాగంబును వితత
విద్రుమలతానికుంజపుంజ సమభిరంజితప్రదేశ నిర్దిష్ట సంతతా
దిష్టచరమసంధ్యా విశేషరాగంబును గమతఝషకుళీరతిమితి
మింగిలాది సత్త్వసంపాతసంభృతాచ్ఛోదిత ధ్వనివిలీననిఖిల
చేతనారవంబును దటవిఘాతపాతవికిరదవిరళ పరాగవినిభృ
తద్విరేఫకుసుమమంజరీ విశాలలవలీలవంగలుంగలతాలాస్య
విభవంబును బహుభూభృదవిరతప్రచారాభిషవణంబును నమే
యవాహినీవధూముఖప్రసక్తభూషణంబును నగు మహా
సముద్రంబు డగ్గఱి తదీయోదరంబున. 155

చ. కనియెం బురం బనర్ఘమణికాంచనసౌధము నత్యుదగ్రసా
ధనము నసాధ్యశిల్పఘనదారుణసాలము నద్భుతైకస
జ్జనసముదగ్రఘట్టము విశాలతరాట్టము నుచ్ఛటారిత
ర్జనము ననల్పగర్జనసురద్విషదుజ్జ్వలితంబు నిమ్ముగన్. 156

మ. కని యత్యుద్ధతి శంఖ మొత్తుటయు నాకంపించె ధాత్రీతలం
బనిలస్కంధము లేచు చిక్కువడియె న్వ్యాదోనిధు ల్డిందె ఘూ
ర్ణనముం బొందె సురేంద్రలోకములు విన్నంబోయెఁ బాతా
ళము, ల్వినియోగంబులు దప్పె భూతచయము ల్వ్రీలె
న్దిశాభాగముల్. 157

వ. ఇట్లు యుగవిగమసమయఘనఘనాఘనకఠోరదీర్ఘ [1]నిర్ఘాతడా
త్కార శతసహస్రభైరవం బగు నమ్మహారవంబు కర్ణశూలం
బై తాఁకినఁ గనలి దానవులు హలముసలపరశుపట్టిసప్రాసపరి
ఘాముద్గరముసుండి దండ కోదండ కుంతకులిశభల్లభిందివాల
శంఖశక్తి కర్తరి కఠారకుఠారలవిత్రతోమరశూలఖట్వాంగ

1. తరశతసహస్ర.

చక్ర చంద్రహాస మహాంకుశ గదాపాశపాషాణ ప్రముఖంబు
లగు మహాస్త్రశస్త్రంబులు వహించి వికటగర్జారవభరంబున
నంబరంబు పిక్కటిల్ల నొక్కపెట్ట యమ్మహానగరంబు వెడలి
తదీయస్యందనంబుఁ జుట్టుముట్టి. 158

మ. ఘనశస్త్రాస్త్రమహాతివర్షము నొగి న్గర్జామహాడంబర
ధ్వనిసంపీతఘనాఘనౌఘనిపతద్ధారాళధారామహా
శనివర్షంబుల ద్వంద్వ మొంచఁ బయిపై సంరంభశుంభద్గతి
న్వనధుల్ ఘూర్ణిల బిట్టు వాపిపయి న్వర్షించె నొక్కుమ్మడిన్.

క. వాలికవెఁఱుంగుఁదూపులు
నాళీకోదరునిమఱఁది నలిదైత్యులపైఁ
గీలించెఁ జేరువేర
న్వాలమునఁ బదేసికంకపత్రములు వడిన్. 160

మ. అలుకం దానవు లొక్కయుమ్మడి తదీయస్యందనోరుద్యుతి
స్ఖలనంబు న్సురసిద్ధచారణమహాశ్చర్యంబు గావించుచు
న్గలహాక్షోణియు నాకసంబు దిశలుం గాండప్రకాండంబులం
గలయం గప్పి యదల్చి యార్చిరి సమాకంపింప భూతా
వళుల్. 161

తే. భయభరంబున వెలవెలఁ బాఱి రపుడు
త్రిదశసారథి ధృతిదప్పె తేరు గడప
భ్రమసియుండినఁ దాన సారథియు రథియు
నగుచుఁ బరిమార్చె నరికోటి నర్జునుండు. 162

క. నిర్జరసారథి యర్జును
దుర్జయవిక్రమము సమరదోహలతయు దోః
ఖర్జూభరంబు సారథి
యార్జిత్యముఁ జూచి మిగుల హర్షముఁ బొందెన్. 163

సీ. అసురు లుద్ధతి శూలహాలభిందివాలంబు
లడరించి రడఁగించె నర్జునుండు
దైత్యు లుద్దండించి దండసంకులశక్తు
లిగిడించి రుడిగించె నింద్రసుతుఁడు
దైతేయు లేచి ముద్గరగదాంకుశములు
ఘటియించి రదలించె ఫల్గునుండు
సురవైరు లల్కఁ దోమరకుంతగుణములు
సారించి రెడలించె సవ్యసాచి
తే. కణయకంపరఖేటకక్రకచకులిశ
చక్రఖట్వాంగకుద్దాలచంద్రహాస
వివిధశస్త్రాస్త్రములు వైచి [1]రవఘళించె
శుక్రశిష్యుల ద్రోణశిష్యుండు గెలిచె. 164
వ. అయ్యవసరంబున. 165
శా. జంభారిప్రభవప్రయుక్తనిబిడజ్యారావగంభీరసం
రంభభ్రామితగాండివప్రసరదస్త్రవ్రాతదీవ్యత్ప్రరా
సంభిన్నాంగములై సురారితనువు ల్సంగ్రామరంగంబునం
గుంభద్రోణము లట్ల బిట్టు గురిసెం ఘోరంబుగా రక్తముల్.
క. చేయునది లేక దనుజులు
మాయాయుద్ధంబు సేయ మదిఁ దలఁచి ధృతిం
బాయక వైచిరి విద్యా
వైయాత్యము మించఁ బహువర్షాస్త్రంబుల్. 167
క. వడిఁ బాము ప్రేలఁగట్టిన
వడువున నలుగడల ముసరె వార్వాహంబు

1. యవఘళించు.

జడివడి కురియఁదొడంగెను
వెడవెలుపును లేక పాండవేయునిమీఁదన్. 168

మ. బలభిద్ధ్వంసివరంబునం గొనినదివ్యన్మాయతాస్త్రంబుచే
జలవాహంబులు వట్టిఁజేసె నరుఁ డక్షయ్యప్రతాపంబున
న్గలయం గప్పిరి దారుణాశ్మముల నుగ్రస్వాంతులై యేచి దై
త్యులు పార్థుం గులిశాస్త్ర మేసి రవి తోడ్తోఁ ద్రుంచె నా
తం డొగిన్. 169

చ. అనలసమీరణాత్మకములైనమహాస్త్రము లేసి రుద్ధతిం
దనుజులు గాడ్పుతోఁ బెరసి నల్గడ లొక్కట విస్ఫులింగము
ల్గనకనఁ గ్రాలఁ బావకశిఖ ల్వెస ముంచె సురేంద్రనందను
న్గనలి యతం డణంచె నవి గ్రక్కున వారిమహాశుగంబులన్.

చ. తిమిరమహాస్త్ర మేసి రణతీవ్రత సూపిరి దైత్యపుంగవుల్
క్రమమునఁ గప్పె నల్గడల గాఢమహోద్ధతిఁ జిమ్మచీఁకటుల్
తెమలె దిశావివేకమును ధీరతయు న్వెస నెల్లవారికిం
బ్రమసి సురేంద్రసారథియుఁ బాఱఁగ నైచెఁ బ్రతోద మ
వ్వలన్. 171

క. రథ్యములు పఱవనేరక
మిథ్యాభిమతంబు లయ్యె మెయి మఱచి సమి
ద్రథ్య ధనంజయుఁ గానక
తథ్యమునకు లేక యుండఁ దత్సారథియున్. 172

వ. భయం బంది యర్జున! యెటపోయె దని యెలుంగెత్తి యా
హ్వానంబు సేసి తొల్లి దేవాసురసమరంబు లనేకంబులు చూచి
తిం గాని యిట్టిభయోద్రేకజన్యంబులగు జన్యంబులు సూడ
మీఁద వరజనితవీర్యదర్పితులు గావున వీరి సంప్రహారంబు

ఘోరంబని పల్కిన మాతలి నూఱడించి యించుక సేపు మద్భుజావిహారంబు చూడు మని పల్కునుండు. 173

శా. జంభధ్వంసివరంబునం గనినయస్త్రంబు న్మహాసారముం
శుంభద్విక్రమబాహువర్వములు సంశోభిల్ల నేనెం దమ
స్సంభారం బడఁగన్ దిశల్విపులవైశద్యంబు నొందన్ సుర
ల్సంభావింప భయంపడంగ దితిజు ల్సంగ్రామరంగంబునన్.

మ. జవ మేపాఱఁగఁ గూలె దైత్యతనువు ల్సర్వంసహాపీఠిఁ బాం
డవగాండీవధనుఃప్రకాండభవకాండప్రస్ఫుటోచ్చండతాం
డవపాండిత్యవిశేషవిభ్రమకృతాడంబప్రతీకంబులై
యవనీధ్రంబులభంగి నింగి యద్రువన్ హాహానినాదంబులన్.

వ. ఇట్లు నివాతకవచులు నిరవశేషులై మడసిన సంక్రందననంద నుండు [1]తత్పురంబులోనికిం జని యంతయుం గనుంగొని మాతలి కిట్లనియె. 176

తే. కనకమయహట్టకుట్టిమకాంత మగుచు
వివిధమణిసౌధములును వస్తువులు గల్గు
నిప్పురంబునఁ గాఁపుండ కితర మైన
పురమునం దేల నిల్చె నిర్జరవిభుండు. 177

ఉ. నావుడు నిట్లనుం ద్రిదశనాయకుసారథి నిర్జరేశ్వరుం
డీవనరాశిలోన సృజియించెను దైత్యభయంబుచేత దే
వావలి యుండ నిప్పుర ముదగ్రగతిం దనుసూను లంత రా
జీవభవుం బ్రసన్నునిగఁ జేసి మహాబలవీర్యవంతులై. 178

1. తదీయనారీ సమాక్రందనంబు తత్పురంబు. అని యొక ముద్రణ మున కానవచ్చుచున్నది.

క. ఇందుండఁగ నింద్రాదిక
బృందారకవరులతోడఁ బెనఁకువ నెందుం
గ్రిందుపడకుండఁ దపమున
నందిరి వర మఖిలభువనహననోత్సుకతన్. 179

వ. కావునం దద్విజయార్థంబుగా విజయ నిన్ను వాసవుండు పనిచె, నిమ్మహాసురులు మరుద్గరుడగంధర్వసిద్ధసాధ్యుల కసాధ్యు లిట్టివారల విక్రమంబునం జంపి పెంపు గాంచితివి. భవదీయసత్త్వసాహసంబులకుం గొలఁది యెక్కుడియది యని యర్జునుం బ్రస్తుతించి మాతలి రథంబు గ్రమ్మఱించె. ఇట్లు నివాతకవచులఁ బరాభవించి భవ్యతేజోదుర్నిరీక్ష్యుండై పాండవేయుండు మరలి వచ్చువాఁడు ముందట. 180

ఆ. వివిధవృక్షగుల్మ విస్తీర్ణ మై కడుం
బొలుపు మిగులు నొకతపోవనంబు
నతివిచిత్రశిల్ప మగుపట్టణంబును
నుజ్జ్వలంబు లగుచు నున్నఁ గాంచి. 181

క. సురసారథి ! యిది యెవ్వరి
పుర మిమ్మహనీయఘనతపోవిపినం బె
వ్వరిది యిది నాదుదృష్టికి
హరహర ! యతివిస్మయంబు నాపాదించెన్. 182

వ. అనవుడు నమ్మహాత్మునకు నాతఁ డిట్లనుఁ దొల్లి పులోమియు గాలికయు నను నసురకాంత లిత్తపోవనంబున దివ్యసహస్ర వర్షంబు లత్యుగ్రనియమంబునఁ బద్మగర్భు నారాధించి తత్ప్ర

